# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపాదకుడు: తెలికిచర్ల వెంకటరత్నం

సంపుటి ౩

సంచిక ౧



నవ్య సాహిత్య పరిషత్తు

గుంటూరు

# నవ్య సాహిత్య పరిషత్తు

## △ గుంటూరు △

### కార్యనిర్వాహక వర్గము ౧౯౩౮—

| | | |
|---|---|---|
| బుర్రా శేషగిరి రావు పంతులు | ... | అధ్యక్షుడు |
| కాటూరి వెంకటేశ్వర రావు | ... | ఉపాధ్యక్షుడు |
| తెలికిచర్ల వెంకటరత్నం | ... | కార్యదర్శి |

### సభ్యులు

| | | |
|---|---|---|
| పప్పూరి రామాచార్యులు | ... | అనంతపురము |
| చిలుకూరి నారాయణ రావు | ... | ,, |
| దేవరపల్లి వెంకట కృష్ణా రెడ్డి | ... | ఉంగపాడు |
| నోరి నరసింహ శాస్త్రి | ... | రేపల్లె |
| కొడాలి ఆంజనేయులు | ... | తెనాలి |
| పిల్లలమర్రి బాలకృష్ణ శాస్త్రి | ... | ,, |
| అడివి బాపి రాజు | ... | బందరు |
| బొడ్డు బాపి రాజు | ... | ఏలూరు |
| ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి | ... | రామచంద్రపురము |
| వేదుల సత్యనారాయణ శాస్త్రి | ... | పిఠాపురము |
| శ్రీరంగం శ్రీనివాస రావు | ... | విశాఖపట్నము |
| గురుభాగవతుల ధర్మా రావు | ... | బరంపురము |

### పూర్వాధ్యక్షులు

| | | |
|---|---|---|
| చిలుకూరి నారాయణ రావు | ... | ౧౯౩౩ |
| రాయప్రోలు సుబ్బా రావు | ... | ౧౯౩౩—౩౪ |
| తల్లావఝ్ఝల శివ శంకర శాస్త్రి | ... | ౧౯౩౪—౩౬ |
| పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి | ... | ౧౯౩౬—౩౭ |
| గిడుగు వెంకట రామమూర్తి పంతులు | ... | ౧౯౩౭—౩౮ |

# రమ్యాలోకము

## = స్థాలీపులాకము =

**రాయప్రోలు సుబ్బారావు**

క్రౌంచ మిథునానురాగ దారణము వలని
శోకమే శ్లోక మయి, యే మృదూక్కృతాత్మ
ముఖ వియత్పథమున గంగబోలి వెడలె
ఆ వచస్వి ప్రాచేతను నాత్మ దలతు!

... ...

మూడుకోట్ల జీవత్కంఠముల సహాని -
శల్ ప్రతిధ్వనించుచు నీవిశాల సుంద
రాంధ్రి భూనభోంతర పరివ్యాప్త మయిన
అమృత శబ్దావతారము నాశ్రయింతు!

సొబగు లెగయు తారకల రాసులకునడుమ
దర్శనీయ మాక్షీరపథంబు పగిది
దేశభాషాప్రవాహ వీథికలలోన
తెనుగుపాయ రంజిలు తేనె తొణుకులాడ.

ఏ ప్రఫుల్ల పుష్పంబుల నీశ్వరునకు
పూజ సల్పితినో, యిందు పుట్టినాడ!
కలదయేని పునర్జన్మ కలుగుగాక
మధుర మధురం బయిన తెన్గు మాతృభాష!

... ...

పూల కడుపులలో తేనె పోసె నెవడొ
దాని దీయు నేరుపు తుమ్మెదకు లభించె
భాషలోని మాధుర్య లావణ్య భావ
సాధుభోగము కవిముఖ సాధ్య మయ్యె.

మాధుర్య లిచ్ఛయించెదరు సంభోగసుఖము
నే వియోగ మాధుర్య లీలావిపాక
మనుభవింప అర్థాడెద ననదె యాంధ్ర
రసికకులరాజు పండితరాజు మున్ను!

... ...

చిన్ని నివ్వరి సిగవలె సన్నగా త -
ళుక్కుమన జీవి లక్షించె నొక్కదృష్టి.
నవ్యతృణకంకణా భరణ ప్రియుక్తి
ప్రేమయోగ మొక్కండు భావించె నేడు.

... ...

నవరసైశ్వర్య కాంతిమంతంబు లైన
కావ్యకుసుమ బంధంబులన్ కఠినకుటిల
దోషనఖముల జీల్చిన దుర్విదగ్ధు
లిపు డయస్కర్మకుశలు లైరేమొ పుడమి!

... ...

వాణి వాయింప మోగిన వీణమీద
పారసీక గీతంబులు పలుక మనెనె!
ఋషుల నీవారములు ఫలియించినట్టి
పొలములందు గులాబీలు పూయ మనెనె!

సరస వాక్యార్థము లభిధావరణ మెడలి
లక్షణా వ్యంజనా వీథులన్ భ్రమించు,
పూవు విడిచి వాయు తరంగముల నపార
దూర మేగెడి పరిమళసార మట్లు.

శీల మట్టుల నౌచితిం జెదరనీక
అహివిధాన నశ్లీల మనాదరించి
ప్రేమ మంత్ర మహోపాసనామయు లగు
నవ్యుల కుపాధి యయ్యె సౌందర్య మొకటె.

# రసాస్వాదన

## కల్లావజ్ఝల కృత్తివాస తీర్థులు

అనుభవానికి హృదయం అవసరం. ఏకళలో మాధుర్య మైనా ఇంపుగా ఉన్న దంటే హృదయసంవాది అయిన దని చెప్పవలె. మనోహర మైన కావ్యగానము, మధుర మైన అమరగానము, చైతన్యం గల శిల్పసౌందర్యము హృదయానికి సోకుతవి. కావ్య కళ గాని, మ రేకళ గాని, ఆస్వాదించడానికి హృదయమే కావాలి. పద్యం చదివితే వెంటనే ఎంత హాయిగా ఉంది అనడం సహజం; వెంటనే హృదయ సంవాద భాజము అవుతుంది. సహృదయు డైనవాడే రసాస్వాదనకు తగినవాడు. రసానుభవానికి సౌహార్దత అత్యవసరం.

మానవహృదయం చాలా కోమలమూ ఆర్ద్రమూ. ప్రతి హృదయంలో కొద్దిగానో గొప్పగానో భావా లుంటవి. మనుష్యు డైన ప్రతివాడికీ వాసనలు (Instincts) ఉంటవి. ఈ వాసనలద్వారా హృదయంలో అణిగి ఉన్న భావాలు, కావ్యగానం విన్నపుడు అభివ్యక్త మవుతవి. స్థాయిభావాలు వాసనారూపంగా సాధారణీ కరణ ధర్మం (Universal aspect) పొంది అభివ్యక్త మవుతవి.

రసవాదా లన్నింటిలో అభినవ గుప్తాచార్యుల అభివ్యక్తివాదము సహృదయ రంజక మైనది. అభినవగుప్తుడు సాహిత్య దర్శన శాస్త్రాలలో నిష్ణాత. పూజ్యు డైన భరతముని నాట్యశాస్త్రమూ, ఆయన ఇతర గ్రంథా లన్నా ఆయన అనుయాయుల గ్రంథజాల మన్నా అభినవ గుప్తపాదులకు చాలా ఇష్టం. ఈ రెండు కారణాలవల్లా నాటకానికి భావాదులు ఎలా అవసరమో, అలాగే కావ్యానికికూడా భావాదులు అత్యవసర మనీ రసానికి ప్రధాన స్థానం ఇచ్చి తీరవలె ననీ నిశ్చయించుకొన్నాడు. రస సాక్షాత్కారము భరతాచార్యుడు రూపక విషయంలోనే చెప్పాడు కాని కావ్యవిషయంలో ఎత్తుకోలేదు. అందువల్ల అభినవ గుప్తుడు రస సాక్షాత్కారము కావ్యానికి కూడా రూపకానికి వలెనే అవసర మనీ, నిశ్చితబుద్ధితో ప్రాచీనా లంకారికుల రసవాదాలలో లోపాలను దూరము చేసి, ఆధునిక సంప్రదాయము వారి ధ్వని వాదములో రసవాదాన్ని చాలా కౌశలముతో పొందు పరచినాడు. సామాజికుల లేక సహృదయుల హృదయాలలో స్థాయి భావము వాసనా రూపంగా ఉపస్థితమై ఉంటుంది. కావ్య పఠనము చేసినప్పుడు గాని

ఉత్తమ నాటకము చూచినప్పుడు గాని వాసనా రూపంగా ఉండేస్థాయి సాధారణీకృత విభావాల మూలంగా ప్రకటిత మవుతుంది. ఆచార్యుడు కాళిదాసు శాకున్తలంలో శ్లోకం తన రసవాదానికి ఆధారం పెట్టుకొన్నాడు.

రమ్యాణి వీక్ష్య మధురాం శ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకీ భవతి య త్సుఖితో௨పి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని.

మనుష్యుడు సుఖంలో మునిగినప్పటికీ, సుందర వస్తుదర్శనమువల్ల పర్యుత్సుఖు డవుతాడు. మధురగానము వినడంతోనే హృదయంలో ఉపస్థితమైన వాసనారూపాన పూర్వజన్మవిషయక భావములుకూడా స్మరించినాడు మష్యంతుడు. దూర్వాసుడి శాపంవల్ల శకుంతలయందు లగ్నమైనప్రేమ విస్మరించాడు రాజు. కర్ణరసాయన మైనగానం వినడంతోనే హృదయములో నివురుగప్పిన నిప్పువలె ఉన్న వాసనారూప మైన శకుంతలా విషయక ప్రణయభావము పర్యుత్సుకుడై అనుభవిస్తూ ఉంటాడు. ఈశ్లోకంలో నాలుగోపాదం అభివ్యక్తరసవాదానికి ఆయువుపట్టు. 'భావస్థిరాణి' స్థాయిభావము అని అర్థము చేసుకోవాల. 'స్మరతి' అన్నప్పుడు స్ఫుటముగా గ్రహించడం కాదు, అబోధ రూప మైన పూర్వవృత్త సంస్మరణము.

మన హృదయాలలో రసానికి ఆధారభూత మైన స్థాయిభావము వాసనారూపాన సహజంగా ఉండడంవల్ల అది (Universal aspect) సాధారణీకరణధర్మం పొంది, ఉపర్యుక్త విభావాదుల అభినయ సౌందర్యంతో కలిసి, దేశకాల పరిమాణాలను దూరము చేస్తుంది. ఇటువంటి ఆస్వాద్యశక్తి రసజ్ఞులు, సహృదయులూ అయినవారందరికీ ఉంటుంది. రసికు లందరూ రసమును ఆస్వాదిస్తారు, కనుక సాధారణీకరణ ధర్మము తప్పక పొందవలసి ఉంటుంది. ఈ ఆస్వాద్యస్థితే కావ్యనాటకాదుల్లో రసము. అయితే, ఆస్వాద్యశక్తి అందరికీ సమానంగా ఎప్పుడూ ఉండదు. సౌహార్దత రాసిక్యాన్ని అనుసరించి, రసము ప్రతీయమాన మవుతుంది. సంస్కారం లేని సామాన్య పాఠకుడు పరిమిత మైనరసానుభవం పొందుతాడు. విమలప్రతిభాశాలి అయినరసికుడు రసాస్వాదనకు అధికారి. అందువల్ల రసానుభవము సౌహార్దతనుబట్టి హెచ్చూ తగ్గూ అవుతుంది. కవిత్వం విద్యార్థి ఆనందిస్తాడు. కావ్యనాటకాలంకారాలు సాహిత్యములో జ్ఞానం దిట్టపరుచుకొన్న వాడు కవిత్వంలో మెళుకువలు పోకడలు, అంద చందాలు మొదలైనవి బాగా రుచి చూడగలడు. సామాన్యుడు స్థూలదృష్టితో

శిల్పసౌందర్యము చూస్తాడు. కొద్దిగానో గొప్పగానో శిల్పి అయినవాడు, లేదా శిల్పంలో అభినివేశం ఉన్నవాడు, శిల్పసౌందర్యం, అందులో జీవం, జిగీ, సూక్ష్మంగా గ్రహించి, సామాన్యుడికంటె విలక్షణమై స్ఫుటమైన ఆనందానుభవం పొందుతాడు.

మానవుడు సృష్టి అయినప్పుడే అతనిలో ప్రాతిభాసికమైన జ్ఞానలేశము (Intuition) స్వతస్సిద్ధముగానే ఉంటుంది. అయితే ఆజ్ఞానము బహుకొద్దిమందిలో విజృంభించి వారిని జ్ఞానమూర్తులుగాను కళోపాసకులుగానూ చేస్తుంది. అందరికీ ఈజ్ఞానలేశమున్నప్పటికీ అందరూ కళోపాసకులూ శిల్పులూ కావడం లేదు. ప్రాపంచిక విషయాలలో పూర్తిగా నిమగ్నులై, తటస్థముగా ఉండకపోవడమువల్ల ఈజ్ఞానలేశము అనేకులు విజృంభింప చేసుకోలేక పోతున్నారు. విషయలాలసు డౌతున్న మానవునిలో స్థూలదృష్టి ఎక్కువై ప్రాతిభాసికజ్ఞానము ఆరిపోతున్న నిప్పురవ్వవలె వుంటుంది. అతని హృదయంలో భావములు అతః పూర్వము ఉన్నప్పటికీ అభివ్యక్తము కాలేవు. భావము అభివ్యక్తము కావడమే కళ. భావములు వ్యక్తము కాకపోతే కళాసృష్టి కాలేదు. సహృదయులకు ప్రాతిభాసికజ్ఞానముకూడా సంస్కారముతోపాటు ఉంటే చక్కగా రసానుభవము కలుగుతుంది. అందువల్ల ఆస్వాద్యశక్తి కలుగుతుంది. ఆశక్తి ఎప్పుడు కలిగిందో అప్పుడే రసము అనుభూతిలోకి వస్తుంది.

రసానుభవానికి లేక రసాస్వాదనకు కొన్ని ఆటంకము లున్నవి. రసప్రతీతికి కొన్ని విఘ్నాలు అడ్డు వస్తవి. సకల సందేహాలనుంచీ విఘ్నాలనుంచీ దూరమై విలక్షణమైన ప్రతీతి రసము. అందుకే అభినవ గుప్తుడు రసము 'వీత విఘ్న ప్రతీతి' అని చెప్పినాడు. మంచు తెర తొలిగితే సూర్యకాంతి ప్రత్యక్ష మవుతుంది. ఆరోపితమైనది పోతేగాని వస్తు తత్త్వము తెలియదు. అలాగే రసాస్వాదనకు అడ్డు వచ్చే శక్తులను దూరం చెయ్యాలి. అప్పుడు రసానుభవం కలుగుతుంది. ఈ రసాస్వాదన అన్ని విఘ్నములనుంచీ దూరమయి రససంవిత్తి, చమత్కార నిర్వేశ, రసన, సంవిత్తి, లయ, విశ్రాంతి అనేనామాంతరాలను పొందుతున్నది.

రసాస్వాదనకు వచ్చే విఘ్నములు ఏవేవి ఉన్నవో వాటిని తొలగించు కోడం ఎలాగో యోచించాలి.

(౧) ప్రతిపత్తావయోగ్యతా సంభావనా విరహము.
(౨) స్వగత పరగతత్వనియమేన దేశకాల విశేషము.
(3) నిజసుఖాది వివశీభావము.
(౪) ప్రతిపత్త్యుపాయ వైకల్యము.

(౫) స్ఫుటత్వాభావము.

(౬) అప్రధానత.

(౭) అసంశయ యోగము.

ఈ విఘ్న సప్తకము రసప్రతీతిని ఎదుర్కొంటున్నది. ఒక్కొక్కటి గ్రహించి విఘ్నమెలా తొలగి పోతుందో చూడవలసి ఉంటుంది.

ఎన్నడో పురాణకాలంలో అగస్త్యుడు సముద్రోదకము నంతా ఒక్కసారి ఆపోశనం పట్టాడట. ఇప్పుడెవ రన్నా అలా చేశారని వార్త వింటే ఎంతమాత్రం విశ్వసించము. అటువంటిసంఘటన జరుగుతుం దని సంభావించలేము. ఈరోజుల్లో మహాసముద్రం ఏయంత్రసహాయమూ లేకుండా ఎవడైనా దాటినా డంటే, నమ్మలేము. అలాగే కావ్యవిషయంలోకూడా వస్తుసంఘటన జరిగినట్టు విశ్వసిస్తేనే ఆకావ్యరసం ఆస్వాదించగలము. పితృవాక్యపరిపాలనార్థం శ్రీరాముడు రాజ్యం వదిలి సుఖాలు త్యజించి అరణ్యావాసము చేయడము, హనుమంతుడు సముద్రము దాటడము, మహాబలవంతుడైనరాక్షసరాజుతో రాముడు యుద్ధం చెయ్యడము — ఈకథాంశం జరిగినట్టు మనము సంభావిస్తేనే గాని రసాస్వాదన చెయ్యలేము. ఆంజనేయుడు సముద్రం దాటా డని అంటే నమ్మము. అది అసంభవము. రాముడు పద్నాలుగేళ్లు అరణ్యాల్లో ఉండడమూ అసంభవము— అని సందేహిస్తే సంభావనావిరహము వస్తుంది. అందుకే మనలాక్షణికులు నాటకానికి ఇతివృత్తం ప్రఖ్యాతమైనది ఉండవలె నన్నారు. వీరకార్యములు శ్రీరాముడు చేసినా డంటే పురాణవీరుడైనఅతడు చేయడానికి సమర్థుడే నని విశ్వసించవచ్చు. సామాన్యవ్యక్తిని నాటకంలో నాయకుణ్ణి చేసి అతనిలో ధీరోదాత్తాది గుణాలు కల్పించి, మహాకార్యములు చేశా డంటే నమ్మలేము. అప్పుడు సంభావనా విరహము వస్తుంది. ఇతివృత్తము పురాణేతిహాసాలలో నుంచి తీసుకొంటే మానవాతీతములైన కృత్యాలు పురాణ వీరులు చేశా రంటే, వా రలా చెయ్యగలరా లేరా అని సందేహపడము. గ్రీకు నాటక కర్తలుకూడా మనవాళ్ళవలె సంప్రదాయ ప్రసిద్ధాలైన పురాణముల నుంచే ఇతివృత్తాలు స్వీకరించారు. ప్రఖ్యాతేతివృత్తం గ్రహించినప్పుడు సంభావనా విరహము ఉండదు; రసప్రతీతి కలుగుతుంది.

స్వగత పరగతత్వ నియమముచేత కలిగిన దేశకాల విశేషలేశము రసప్రతీతికి విఘ్నము కలిగించవచ్చు. ఈ విఘ్నమును పోగొట్టడంకోసం నాట్యధర్మి ఏర్పరిచారు. నాట్యధర్మి

అంటే నాటకములో పూర్వరంగములో నాంది, వేషధారణము, రంగ ప్రసాధనము మొదలైనది.

నిజసుఖాది వివశీభావము రసప్రతీతికి విఘ్నము కలిగించవచ్చును. ఇది ముఖ్యంగా నటుడి పక్షంలోనే గాని సామాజికుల పక్షంలో కాదు. నటుడు తన సుఖదుఃఖాలలో తన్మయుడై పోతుంటే రంగము మీద ఏమి నటించగలడు? నాయకుడు దుఃఖపడేఘట్టం తీసుకోండి. రంగంమీదికి వచ్చి తాను నాటకంలో నటిస్తున్నట్టు మరిచి బాగా తన్మయుడై, తన కుటుంబంలో సంభవించిన ఏదో కష్టము స్మృతికి వచ్చి, బావురు మని రాగాలు పెడితే సామాజికులు నవ్వుతారు. అందువల్ల నటుడు నిజ సుఖదుఃఖాలలో తన్మయుడై సమస్తం మరిచిపోతే, నాటకంలోనుంచి సామాజికులు వెళ్ళిపోతారు. పూర్తిగా నటుడు వివశుడు కాక తగుమాత్రంగా రసం పోషించాలి. అయితే సామాజికుల పక్షంలో అలా కాదు. రంగంమీద దుష్యంతుడు లేడిని వేటాడుతున్నప్పుడు, ఆలేడిఅవస్థ మనఅవస్థగా తలుస్తాము. రంగముమీద నటుడి కష్టసుఖాలు మనసుఖాలుగానే పరిణమిస్తవి. సామాజికులము తన్మయులము లేక వివశులము కావచ్చు. రంగంలో దమయంతిదీనావస్థ చూచి మనం దుఃఖవివశులమై కంట తడి పెట్టవచ్చు; నిట్టూర్పులు వదలవచ్చు; అభ్యంతరం లేదు. ఇంతకూ సామాజికులలో నిజసుఖదుఃఖవివశీభావం యోగ్యం. నటుడిలో తగు మాత్రంగా ఉండాలి.

రసప్రతీతి స్ఫుటముగా కలగకపోవచ్చును. ప్రతీపత్త్యుపాయ వైకల్యము, స్ఫుటత్వాభావము అనే రెండు విఘ్నాలు రసాస్వాదనకు అడ్డువస్తవి. కేవలం ప్రత్యక్ష ప్రమాణంవల్లనే రసప్రతీతి స్ఫుటంగా ఎలా కలుగుతుంది? స్ఫుటమై దోషరహితమైన శబ్దాను మానప్రమాణా లున్నప్పటికీ, అంతమాత్రంచేత లభించిన జ్ఞానముతోనే మనం తృప్తిపడము. (Perceptual cognition) ప్రత్యక్షసంబంధమైన బుద్ధ్యపేక్ష లేక పోవడంచేత శబ్దానుమానలబ్ధమైన జ్ఞానానికి సంతుష్టులము కాము. అటువంటి బుద్ధ్యపేక్ష ఉంటే స్ఫుటమైనజ్ఞానం వెంటనే కలుగుతుంది. అందుచేతనే యథార్థ జ్ఞానము ప్రత్యక్షముమీద ఆధారపడి ఉంటుంది. ఒకవస్తువును ప్రత్యక్షంగా తెలుసుకొన్న తరువాత ఆవస్తువును మరోవస్తువుగా అనేక అనుమానాల (Inferences) వల్లగాని, శబ్దంవల్లగాని, నిరూపించడానికి వీలుండదు. ఒకపుడకకు నిప్పు అంటించి తిప్పుతుంటే, ఆ అగ్ని వర్తులముగా గోచర మవుతుంది. అగ్నికి వర్తులత్వం ఎలా వచ్చింది? మనము భ్రమవల్ల ఊహతో వర్తులత్వము అగ్నికి ఆరోపించాము. వర్తు

లాగ్నిస్థూలంగా చూడడంవల్ల అంటున్నాము. సూక్ష్మమైన ప్రత్యక్షంవల్ల భ్రమ తొలిగిపోగా వర్తులత్వం అగ్నికి లేదని తెలుస్తుంది.

భ్రమ ప్రమాదాలవల్ల వర్తులాగ్ని అయింది. అందువల్ల ప్రతీత్యపాయవైకల్యము స్ఫుటత్వాభావములు రసప్రతీతికి అడ్డురాకుండా చేయడానికి శబ్దానుమానాలకంటె భిన్నమైన, ప్రత్యక్షమునకు సన్నిహితమైన అభినయ నాట్యధర్మ వృత్తి ప్రవృత్తులు నాటక ప్రయోగములో ఉపయోగిస్తారు. వృత్తిప్రవృత్తులను గురించి ౧౩, ౨౦ అధ్యాయాలలో నాట్య శాస్త్రంలో భరతుడు వివరించే ఉన్నాడు.

ప్రధానమైన వస్తుతత్త్వము తెలుసుకోడానికి అప్రధాన మైన తద్విశేషణమును ఆశ్రయిస్తే లాభం ఉండదు. అప్రధాన మైన వస్తువిశేషణం తెలుసుకొన్నంత మాత్రాన అసలు వస్తువును తెలుసుకోలేము. శ్వేతాశ్వము అన్నప్పుడు అశ్వమును గురించిన జ్ఞానం ప్రధానం, శ్వేత మనే విశేషణము అప్రధానం. శ్వేతముతో తృప్తి పడితే అశ్వం సంగతి పూర్తిగా తెలియదు. ఆవిధంగానే అప్రధాన మైన విభావాను భావ సంచారీ భావాలతోనే తృప్తిపడితే ప్రధాన మైన స్థాయిభావానుభవ సిద్ధి కలుగదు. ప్రధానము స్థాయిభావరూపమైన రసము. అప్రధానము భావాదులు. అందువల్ల ప్రధానమైన స్థాయిమీద దృష్టి ఎక్కువ ఉంచాలి. ఇలా అన్నందుకు అప్రధానమైన భావాదులను తోసిరాజన్నా రసప్రతీతికి వీలే ఉండదు. అందువల్ల అప్రధానమును ఎక్కువగా ఆశ్రయించి ఊరుకోక ప్రధాన మైనస్థాయిభావానుభవసిద్ధి ఎక్కువ అవసరం. ఒకసందేహం రావచ్చు. విభావాదులు అప్రధానం ఎందువల్ల? స్థాయి ప్రధానం ఎందుచేత? అప్రధానము లైనవిభావాదులు పరమపురుషార్థానికి తోడ్పడవు. స్థాయి భావ మైనరసము పురుషార్థానికి సాధనము. శృంగారరసస్థాయి 'రతి'. 'రతి' కామానికేగాక ధర్మార్థప్రాప్తికికూడా సాధనమే. 'క్రోధము' అర్థమునకు 'ఉత్సాహం' కామార్థములకు తోడ్పడతవి. శాంతరసము రసము లన్నింటిలో ఉత్కృష్టము. జీవిత పరమావధి అయిన మోక్షప్రాప్తికి శాంతరసస్థాయి 'శమము' హేతువు. అందువల్ల స్థాయిభావము ప్రధానము. అందులో ముఖ్యంగా శాంతరసము గొప్పది. అయితే కరుణమే అఖండరసము. సముద్రములోనుంచి తరంగములు ఉద్భవించి తిరిగి సముద్రములో కలిసి ఏక మవుతున్నట్టు, కరుణరసములో శృంగారాదిరసములు నానావికారములై పుట్టి చివరకు కరుణలో లీన మవుతున్నవి.

అభినవగుప్తుడు కాశ్మీరదేశములో ప్రత్యభిజ్ఞానశైవదర్శనములో మహాపండితుడేకాక స్వయముగా యోగసిద్ధిని బడసినవాడు. ఉత్పలదేవరచితమైన 'ఈశ్వరప్రత్యభిజ్ఞాన

విమర్శిని'కి అభినవగుప్తుడు వ్యాఖ్యనూ, 'తంత్రసారము' 'తంత్రాలోకము' 'మాలినీ విజయవార్తికము' మొదలైన సదర్శనగ్రంథాలూ రచించాడు. యోగి కనుక రసప్రతీతి బ్రహ్మాస్వాదమువంటిదే నని చెప్పినాడు. అయితే హఠయోగాభ్యాసములోవలెకాక రసాస్వాదనలో ఆనందానుభవమున్నది. అభినవగుప్తపాదులు రసానందము బ్రహ్మానుభవమువంటిదే నని నొక్కి చెప్పకపోవడంవల్ల విశ్వనాథకవిరాజు స్ఫుటముగా రసానందము సత్త్వోద్రేకమువల్ల పుట్టి బ్రహ్మానందస్వాదతుల్యమైన దనీ, అఖండస్వప్రకాశానందచిన్మయ మనీ, వేద్యాంతరసంబంధశూన్య మనీ, వస్తుతః తదీయసాక్షాత్కారయోగ్య మనీ పృథక్కరణాయోగ్య మనీ చమత్కారప్రాణవంత మనీ చెప్పవలసి వచ్చింది.

Δ

# తాండవ కృష్ణుడు

## చింతా దీక్షితులు

నవ్వు వెన్నెలలు కలకలలాడా
మకరకుండలాల్ తళతళలాడా
ముక్తాహారాల్ గలగలలాడా
చిరుమొలగంటలు గణగణ మోగా
కాళ్ళ గజ్జియలు ఘల్లుఘల్లు మన
నాట్యము చేసెను చిన్నికృష్ణుడు
యమునాసైకతమందు !
నాట్యము చేసెను చిన్నికృష్ణుడు
గోపీహృదయములందు ! !

# కవితా స్రవంతి

అడివి బాపిరాజు

వేయి సంవత్సరాల్ వెనకాల కవినోయ్
వేయి సంవత్సరాల్ పోయాక కవినోయ్ !

వేదాల బుక్కులో పాడాను నేనోయ్
వాల్మీకి గొంతులో ప్రవహించినానోయ్

వేయి సంవత్సరాల్ వెనకాల కవినోయ్
వేయి సంవత్సరాల్ పోయాక కవినోయ్ !

వ్యాసర్షి గీతిలో ప్రజ్వరిల్లానోయ్
కవిగుణాఢ్యుని రక్త కణమునూ నేనోయ్

కాళిదా'సా'నంద కంపిత స్వరమునోయ్
ఆంధ్రకవి భవభూతి అమృత శోకాన్నోయ్

వేయి సంవత్సరాల్ వెనకాల కవినోయ్
వేయి సంవత్సరాల్ పోయాక కవినోయ్ !

తిక్కన్న తెలుగులా తీర్పు నైనానోయ్
ఈనాటి పాటలో ఇమిడి పోయానోయ్

అన్ని బాసల వన్నె చిన్నెలైనానోయ్
ఆశాంతముల వరకు ఆవరించానోయ్

వేయి సంవత్సరాల్ వెనకాల కవినోయ్
వేయి సంవత్సరాల్ పోయాక కవినోయ్ !



# భవిష్యత్తు

**దేశిరాజు కృష్ణశర్మ**

చింతల్లతోపులో జీర్ణించె తుది పొద్దు
చీకట్ల చాలులో చింత లే నిలిచినవి
ముండ్లలో పొదలలో రొదతోడి సొదలలో
గుబురుకొన్నది కోర్కె, కుమిలిపోయెను తెలివి.
కాలమూ కర్మమూ కలిసి గజ్జెలు కట్ట
వల్లకాడున పుర్రె పాటపాడింది.

విఫలమార్గాలలో వెర్రియెత్తిన జీవి
భగ్నతంతువు లన్ని పాడెగా బంధించి
మంచిచెడ్డలు దాని వహియించుచుండగా
సావాసగా డపుడు నాగిపోయినవాడు.

తొర్రిలో నొక పిట్ట తొంగి చూచింది
పుట్టపై నొకపాము పొంగి చూచింది.

ఏయూర నుండియో ఏవార్త గాని
భోరున మోగుతూ పోయింది గాలి.
మూసియుంచుము కిటికి, మూగవోయెను బ్రతుకు
తెల్లవారినగూడ తెరువబోకుము తలుపు
చిరుసోనవానలో సెలయేటిపాటలో
కురిసినది నాకర్తి, మోగినది నాప్రతిభ.
లేయెండవీధిలో రేవెల్గుచాయలో
నడచినది నానీడ నిలిచినది నాఛాయ.
పలికినది పల్కుగా వెలిగినది వెల్గుగా
ఒకరీతిగా నిల్చి ఒక సరణిగా గెల్చి
అందలము నెక్కిచను ఆ రాజమార్గాన
కట్టెలను మోయుచూ గడపనా కాలంబు !

# కనకడి యేను

కా. సూ.

భోజనం అయింది. చేతులు తుడుచుకొంటూ నాలుగిళ్ళవాకిలి దాటి వెళ్లినాం వీధిచావిడీలోకి, నేను మాశేషూను. కుడిచేతివేపున వీధిగోడలోఉన్న పెద్దరావిచెట్టునీడ ఇతరులకు లేదు సరేకదా దానికైనా ఉపచరిస్తుందో లేదో అని అనుమానంగాఉంది. ఊపిరితీయడానికికూడా గాలిలేదు. ఎడమవేపున రచ్చరాయి ఎండలో మల మల మాడుతూంది. వీధిలో ఉన్న ఇసకమీద నుంచి పొగర్లు బయలుదేరుతున్నవి. పొరుగింటికి ఎదురుగాఉన్న గ్రామదేవత ఉయ్యాల కంబాలు పెట్టున పేలిపోతున్నవి. మిట్టమధ్యాహ్నం. దేవతలు దెయ్యాలు స్వేచ్ఛగా సంచారం చెయ్యడానికి స్థలం, కాలంకూడా అనుకూలంగా ఉన్నవి. ఎండ వేడికో, దెయ్యాల భయానికో జడిసి కాబోలు ప్రాణాలమీద ఆశఉన్న, గ్రామస్థులు ఎవరూ వీధిలో తిరగడంలేదు.

నరికిఉన్న ఉయ్యాల కంబాలికి ఎదుటిల్లు మాశేషుగారి జ్ఞాతులది. సమిష్టి రోజులలో వారి కుటుంబం పెద్దజంట కాబట్టి గ్రామదేవత ఉయ్యాలకంబాలు ఆయింటికి ఎదురుగా పాతడం, అమ్మవారు సంబరం అయిపోగానే వాటిని నరకడం ఆచారం అయింది. ఇటీవల గ్రామకరిణీకం మాశేషుగారి జంటలోకిమారినా అమ్మవారి ఉయ్యాలకంబాలు పూర్వంలాగే ఆ యింటి కెదురుగా పాతే ఆచారంమాత్రం నిలిచిపోయింది. పెద్దకుటుంబంవారికి మగసంతతి లేకపోవడంచేత వారికిగల ఇతర ఆస్తులతోసహా ఈ ఇల్లున్నూ దౌహిత్రులకు చెందిపోయినది. వాళ్లందరికీ ఇంతో కొంతో ఉండడంచేత ఇది వాళ్ళకు పులగంమీద పప్పు. వాళ్లలో ఒకళ్లున్నూ ఈ గ్రామస్థులు కాకపోవడంచేతనైతేనేమి సినీమా, నాటకం, సర్కసు మొదలైన మనోరంజకాలు ఈ గ్రామంలో లేకపోవడం చేతనైతేనేమి అశ్రద్ధవల్లనైతేనేమి రాను రాను ఆ యిల్లు శిథిలమైపోతూ వచ్చింది. వెనుకభాగం ఏమీ లేనేలేదు. ఇప్పుడు, మొండిగోడలుతప్ప దాని నిండా బొమ్మజెముడు మొలచిపోయింది. పూర్వం ఒకప్పుడు విరివిగాఉన్న నున్నని వాకిలి గడ్డిగాబులతోను ముళ్ళపొదలతోను నిండిపోయింది. ఈ ఇంట్లో బ్రహ్మరాక్షసి ఒకటి ప్రవేశించడంచేత దీనికి ఈగతి పట్టిందని ఊళ్లో ప్రజలనమ్మకం. దూరంగా ఉన్న మంద బయటికి పశువులను తోలుకుపోవడానికి బద్ధకపడ్డ పశువులకాపు కుర్రాళ్లు 'ఇదేబాగురా' అని తలచుకొని తమ పశువులను మేతకు ఈఇంట్లో ప్రవేశపెట్టి వీధి తలుపులు మూసుకొని పులిబోను అష్టచమ్మాలు ఆడుతూ లోపల సాయంకాలం

వరకూ ఉండేవారు. పశువుల కాళ్ళమట్టు కళ్ళకు, కుర్రాళ్ళ అజాగ్రత వాడుకకు ఈ భాగంకూడా తమామూ శిథిలం అయిపోవడానికి తయారు అవుతుంది. దాహితుర్లలో ఒకడు సంవత్సరానికి ఒకసారి శిస్తులు వసూలుచేసుకోవడానికి వచ్చినప్పుడు తనకు వసతిగా ఉండేనిమిత్తం ముందుభాగాన్ని మాత్రం బాగుచేయించి నేలను పాలగచ్చు చేయించిపెట్టినాడు ఈ మధ్యను. ఈ సారి ఇల్లు మాశేషుకు ఒప్పజెప్పి జాగ్రతగా చూసుకుంటూ ఉండవలసినదని అతనిని వేడుకొన్నాడు. ఇల్లు పాడై పోకుండా చూచుకుండా మన్న మంచి తలంపుతో పశ్చిమపు మందడిగోడలో ఒకదారి పొడిపించి దీని మార్గంగా ఇంటిలోకి పోయి పై కుర్రకాయలు రాకుండా కొయ్యచిరతతో వీధితలుపుమూసి వస్తూఉండేవాడు మాశేషు. పిల్లిలేకుండా ఉన్నప్పుడు ఎలకలదే రాజ్యం. ఏకారణంచేతనైనా శేషు ఇంట్లో లేనప్పుడు తాళపుకన్నంలో నుంచి వేలుదూర్చి దానితో చిరతను మెడ్లించి తలుపుతీసుకొని తాము, తమ పశువులు దూరేవారు ఇంట్లోకి. యథా ప్రకారం తలుపు మాత్రం ఎప్పుడూ మూసిఉండేది. ఈ సంగతి మాశేషుకి తెలిసి ఈ తుంటర్లకు కబురుపంపించి వాళ్ళను దండించి కొట్టునంత చేసినాడు రెండు మూడు సార్లు.

తక్కిన గ్రామకరణాలలాగుగాక మాశేషు బాగా చదువుకొన్నవాడు; మితభాషి; అనవసరంగా ఇతరుల వ్యవహారాలలోకి తలదూర్చి మాటపడడు; చేయవలసిన పని విధిగా చేసితీరుతాడు; ఎర్రగా తొగరు దారంలాగుంటాడు; నడిచినజాడే కనబడదు. బొమ్మ పొట్టిదిఅయినా బుద్ధి జాతి గొప్పది; అతిగుట్టు; చాలా పెద్దమనిషి. అందుచేత గ్రామంలో ఉన్న ప్రజలకందరికీ అతన్ని చూస్తే భయం, గౌరవం, ప్రేమకూడాను. ఎప్పుడు నవ్వినా ముసి ముసి నవ్వేగాని అతను పకపకన నవ్వడం నే నెన్నడూ చూడలేదు. అంతగా నవ్వవలసివస్తే బుస్సు బుస్సు మంటాడు; అదిన్నీ పైకి వినబడకుండా ఉండాలని దిగమింగడానికి ప్రయత్నిస్తాడు. మూతి తుడుచుకుంటున్నట్టు నటించి తువ్వాలుతో నవ్వుతూ ఉన్న మూతిని మూసుకుంటాడు.

పరధ్యానంగా చేతులు తుడుచుకుంటూ రచ్చచావిడి అంచున నిలవబడి దూరాన ఉన్న సస్యాలు లేని పొలాలు మలమల మాడుతూఉన్న రాతిమెట్టులు చూస్తూ నిలువబడ్డాను నేను ఆనాడు. మాశేషు తిరిగీ లోపలికి వెళ్ళినచడే నాచెవినిపడలేదు. ఎందుకు వెళ్ళినాడో అంతకన్న తెలియదు. పొరుగింటి అరుగుమీదనుంచి "మొర్రో" అన్న ధ్వని వినబడ్డది నాకు. పరధ్యానం వదిలి ఈ రోదనమీద ధ్యానం కలిపేసరికి ఒక పశువులకాపు కుర్రవాడు, పదిపన్నెండేళ్ల వాడు, ఆయింటి మెట్లమీదినుంచి దొర్లు కుంటూ దొర్లుకుంటూ వచ్చి నరికిన

ఉయ్యాల కంబాలికి మధ్యను నడివీధిలో నేలనుపడ్డాడు. చుట్టుపక్కల ఇళ్లల్లోనుంచి నలుగురు ఆడవాళ్లూ ఈ ఏడుపువిని పరుగెత్తుకొనివచ్చినారు వాడిదగ్గరకు; అందులో వాడితల్లి ఒకర్తె. రెండు ఆవులు, రెండు బర్రెలు పక్కనే దగ్గరగా నిలబడ్డవి. ఆవులు చెవులు నిక్కబొడుచుకొని గుమిగాపడుస్తూ ఉన్న మనుష్యులవేపు చూస్తున్నవి. మనుష్యుల కష్టనిష్ఠూరాలతో ప్రజోక్యంలేనట్టు దూరంగా ఎక్కడనో చూస్తున్నవి బర్రెలు. నాలుగు గొడ్లున్నూ నెమరు వేస్తున్నవి. ఇంతటిలోకీన్నీ ఈ వింతేమో తెలుసుకుందాం అన్న కుతూహలం ఉన్నవాడిలాగు చడిచప్పుడు లేకుండా గబగబ ఇంట్లోనుంచివచ్చి నాకు కొంచెం దూరంగా రచ్చచావిడి అంచునే నిలబడ్డాడు శేషు. తువ్వాలుతో మొఖం తుడుచుకుంటున్నట్టు నటిస్తున్నాడేకాని తెరచాటునుంచి బుక్కుబుక్కుమని నవ్వు వినుపిస్తూనేఉంది. ఎండలో నడివీధినిపడి మొర్రపెడుతూఉన్న ఈ పేదల మొర్రయెదుట ఇతనినవ్వు ప్రశ్నించడానికు తగినంత ముఖ్యమైనదిగా నాకు తోచలేదు. వెంటనే చావడిమీదనుంచి వీధిలోనికి దుమికి వాళ్ల దగ్గరకు పరుగెత్తివెళ్ళి "ఏమర్రా ఎందుకు ఆ కుర్రకాయ అలాగునపడి ఏడుస్తున్నాడు? వాడిని ఓదార్చడం మానివేసి మీరందరూ వాడితోకూడా ఏడుస్తున్నారు!" అని అడిగినాను వాళ్ళని. "ఆడికి దెయ్యంయే నట్టుకుంది బాబూ" అని వాడితల్లి మరింత బోరుమన్నది. ఒకర్తె తన అరికాలిలో దూళితీసి వాడికి బొట్టు పెట్టింది; మరొకర్తె వాడి మీద తుప్పు తుప్పు మని ముమ్మార్లు ఉమ్మింది వాడి వీపుమీద మూడుసార్లు చరిచింది ఇంకొకర్తె "పట్ట పగలేమిటి దెయ్యమేమిటర్రా! వేలు పట్టుకోవడమేమిటి! చాలులెండి, భయపడకండి" అని ఎంత ధీమా చెప్పినా వాళ్ళ మనస్సుకు నచ్చలేదు. "గొడ్లని ఎండేల ఆఇంట్లో నిలగడదా మనుకున్నాడంట, బాబు. చిరత తియ్యాలని తలుపుబొక్కలో ఏనెట్టినాడంట, బాబు. ఆయింతా గట్టిగా దెయ్యం ఆయేసట్టుకొన్నదంట బాబో ఓ! ఓ!" "మట్టమద్ద్యాన్నం బాబో, అమ్మోరు ఉయ్యాల కంబాలికి ఎదురుగ్గా బాబో ఆ దెయ్యాలు వాళ్లాడే కొంపలో బాబో! నా కొడుకు యేసట్టుకుంది, బాబోఓఓ నేనేంజెయ్యాను, బాబో ఓఓ" అని వాడితల్లి వెక్కివెక్కి మొర్రపెడుతూంది. ఎండ మండిపోతుంది, కాళ్ళు కాలిపోతూన్నవి; పశువులూ కదలవు, పశువులను ఏలుతున్నాం అనుకొంటూఉన్న మనుష్యులు అంతకన్నా కదలరు. అవి ఊరుకున్నవి. వీళ్లు ఏడుస్తున్నారు; ఇంతేభేదం. మరి లాభం లేదనితోచి నేను వాళ్లని మరొకసారి భయంలేదని ఓదార్చి చావడి మీదకి తిరిగివచ్చినాను. ముసిముసినవ్వులు నవ్వుతూ "ఏమిటోయి, ఆ అల్లర!" అని నన్ను అడిగినాడు మాశేషు. "దెయ్యం వాడివేలు పట్టుకుందిట! పొరుగింటి తలుపు కన్నంలో వాడు వేలు పెట్టినాడట!" అని

చెప్పినాను నేను. “ఔను, అయితే అయి ఉంటుంది! ఆయింట్లో దెయ్యాలున్నాయని అందరూ అంటారు. ఆలోపలికి పోవద్దని నేను ఎన్నోసార్లు వాడితో చెప్పినాను; మాననందుకు వాడికి తగినశాస్తిఅయింది” అని తిరిగీ నవ్వినాడు శేషు ఒక గంటలో ఊరంతా పుకారుపుట్టిపోయింది—“దెయ్యం కనక డేనట్టుకుం”దని ఆనాటి సాయంకాలం గ్రామమునసబు కరణంగారి దగ్గరకువచ్చి “ఇల్నా రా. బాబు యీయింత! తెలగకనక డేను దెయ్యమట్టుకుందంట!” అన్నాడు. “ఔనోయి, యికమీదైనా బుద్ధిగాఉండి గొడ్లని లోపలికి తోలుకుబోవద్దని వాడిని మందలించు. గ్రామాధికార్ల మాట వినక పోయినవాళ్ల పాట్లు ఇంతేనయ్యా” అని అంటూ ముసిముసి నవ్వులు నవ్వినాడు కరణం శేషు.



# అస్తమయము

## “ సంపత్ ”

మునిమాపులో రక్త సిక్తాంశుకము లారసె
చెలిచూపులో వ్యక్తమగు జేగురులు విరిసె

జరఠసంధ్యారోచి జాలకమ్ములవంగె
పరితాపశిఖ లేచి పథిక హృదయము కుంగె.

పురి విచ్చి చీకటులు పుడమిపై దిగజారె
మలుపచ్చి వేదనలు హృదయ రక్తముగోరె.

# శ్రీ జనార్దనరాయలకు


## గణపతి శాస్త్రి


పోయితి వీవు కార్తికపు బున్నమ రేయి విభాత చంద్రికా
చ్ఛాయల దివ్యశోభవలె శాంతమనోజ్ఞ నిమేషమూర్తివై;
నాయెద శూన్యమై చను ననారతముం బడి మొత్తు వాసలో
'హా'యని మ్రోయు నంధనిశి నొక్క విశీర్ణస్పృహాశయానమై.

హృదయము విప్పికో నిక మరెవ్వరు నాకిట; జీవితమ్ములో
నదయత ద్రివ్విపోయితి వసంతగభీరము నీయభాతముం,
బ్రదుకు భరింపరాని యెదో భారమునం బడి క్రుంగు, దీనమై
కదలగబోయి కూలబడు కన్నులు చిల్లులుపోవు తామసిన్.

శ్రావణసాంధ్యవేళ వికసన్మృదు చంద్రిక జంద్రకాంతముల్
బూవుల గుల్క; వీథికడ మ్రోయును బాలురఖేలన ధ్వనుల్;
నీవు గతించినావుగద! నిల్వదు జీవితమో నిమేషముం
బోవు మహాప్రవాహగతి; బోయిన నీకయి యాగి చూడకే.

పోవును ధూళిలో గలసిపోవు మనోహరసౌహృదమ్ము; లీ
జీవన దాత్రదీపికలు చిన్ని యెడందల నూత్నయౌవనా
శావహరాగలాస్యములు నట్టులె వెల్వెలబారు నంతలో;
నేవి నశింప నీకనుల నిట్టుల బాష్పజలమ్ము నింపకే.

భోరను వర్షధారల నభోంగణ మెల్ల వినిద్రవాయుగం
భీర మహార్త రోదనల భీకర సంహతి మ్రోయు రేలలో,
ద్వారము జేరి, యీ కఠినధారల నీవెట నిద్ర గొందువో!
నీరవమూర్తివై యెచట నిల్చెదవో! యని తల్లడిల్లెదన్.

## శ్రీ జనార్దనరాయలకు

ఎరుగుదు నేను మృత్యు నిగృహీతు లమేయమహాంధకార సా
గరమున మున్గి, యింక మరి కానగరా రని, కాని యేలనో
మరి యొకమారు వచ్చి, యిట మమ్ముల నందర నూరడింపకే
యరుగ వటంచు, నా హృదయ మాశలతో బరువెత్తు నూరకే.

బ్రతికిన గొన్నినాళులు నపార కవిత్వ కళామహత్త్వపో
వ్రతమున బద్ధకంకణత వర్తిల, వాఙ్మయ యజ్ఞవేది నా
హుతి యయిపోయినా వెటో! మహోన్నతమూర్తివి; మేముమాత్రమో
అతుకుల బొంత లీ బ్రతుకు లట్టులె యీడ్తుము శుష్కవీథులన్.

ఏల వచింతు మే మిటు గతించితివీ వని సంతతార్తి నీ
లీల పదేపదే; మృతియె లేదు రసోల్బణమూర్తి నీ కకం
గాల మహాపగాశ్రుజల కశ్మలపూరము నీసుధాస్మృతిన్
గోలున నేడ్చు; దత్తటి నగోచరమూర్తిని వెల్గు నీకునై.

మెల్ల దురాయి లేజవురు మేలిమిబంగరు సంజవెల్గులం
దల్లల నాడు వేళ, కుసుమారుణశయ్యలనో శయింతు నీ
వల్లన దాళ్ళనాడు చివురాకుల మ్రోతల నాలకించుచుం
జల్లనిపిల్లవీవలుల చాయలనో విహరింతు నిత్యమున్.

ఎన్నడు బోని యీవిధిఘటించిన మృత్యుకఠోర సేతువే
భిన్నము సేసి, కాలమయ భీకరవార్ధి గభీరవారిలో
ఛిన్నవిశీర్ణ మైన మన చిన్ని యెడందల ప్రేమహార మిం
కెన్నియుగాలకో! మరల నిర్జ్వరముం గని నిశ్వసించుటల్.

△

# లీలావతి

ఆ వంచర్ల రామమూర్తి

ఓహో నాలీలావతి
ఆహా నాలీలావతి
అదుగో నాలీలావతి
అరుగుదెంచు నాకడకే!

నుదుట కురులు నాట్య మాడ
పదయుగాన నూపురముల
మధుర శింజితమ్ము చెలగ
సదనమునకు వచ్చు నదిగో!
అదుగో...

హృదయమ్మున రాగ ముబుక
కదలెడి వక్షఃస్థలితో
అదరెడి నాసాపుటముల
వెదజల్లుచు వేడిరక్తి
అదుగో...

కదలెడి కృష్ణోర్ముల గమి
విదలింపుల వింతహొయి
ఇది యని చాటెడు వస్త్రా
చ్ఛాదిత మా నును మెరుగుల
అదుగో...

ఎదలోగల పుత్రివాంఛ
కదపగ తా నాథునితో
విదురాశ్వత్థము యాత్రను
కొదువ లేక చేసి వచ్చె!
అదుగో...

సదనములో ప్రేమ లేదు
హృదయమ్మున శాంతి లేదు
బాధ నొసగి సాధు హృదయ
మృదుల కుసుమ దళిత దళము
అదుగో...

ఆదుకొనదు భర్త ప్రేమ
మోద మింక గనదు చెలియ
నాదు ప్రేమ నభిలషింప
వాదు లాడ ధర్మ మనుచు
అదుగో నాలీలావతి
అరుగు దెంచు నాకొరకే
తుది మొదలును లేని ప్రేమ
ముదమున రాగోన్మాదిని!

# పెనుమర్తి వెంకటరత్నం

## (జీవితం)

### పెనుమర్తి కామేశ్వరరావు

౧

నాసోదరుడిజీవితంగూర్చి వ్రాయడానికి నేనే పూనుకోవడం సమంజసమైనపని. తెలుగులో ౨౦ ఖండకావ్యములు, భామహుడు, కన్నడవాఙ్మయములోని యాంధ్రకవులు, స్ఫోటవాదము, ఆర్యులు-దాక్షిణాత్యభాషలు, మొదలైనవ్యాసములు రచియించి తెలుగుదేశములో కొంత పేరుపడ్డ పెనుమర్తి వెంకటరత్నముగారినిగూర్చి తెలుసుకోవాలని చాలామందికి కుతూహలం ఉంటుంది. ౨౨ వత్సరాలలోనే ముగిసిపోయిన ఈయనజీవితంలో, ఈయన ఏఘనకార్యాలు చేసివుంటాడని అనుకోరు. ఈయన రచించిన దుఃఖరసప్రధానములైనకావ్యాలు చదివి ఇంత అల్పకాలంలో మృతి నొందిన ఈయనకు జీవితంమీద ఇంతటివిరక్తి యెందుకు కలిగిందా అని ప్రతివారికీ అనుమానం, ఆశ్చర్యం కలగవచ్చు. అందుకోసమే ఈసంగ్రహము వ్రాస్తున్నాను.

మాగ్రామం తెనాలికి ఆరుమైళ్ళదూరాన వున్న పోతుమర్రుఅగ్రహారం. అక్కడ మాతాతలనాటినుంచి నేటివరకూ బ్రాహ్మణులలో మా వేగినాటిశాఖకు చెందినవారు తప్ప మరొకరు లేరు. దాదాపు అందరూ వ్యవసాయం చేసుకుని జీవించేవారే. మావూరు పెద్దది కాదు, సుమారు 200 గడప ఉంటుంది.

మా ప్రపితామహుడు వెంకయ్యగారు గొప్పవైణికుడు. దక్షిణదేశంలో చాలా పట్టణాలలో తన ప్రతిభను చాటినవాడు. ఆయనకు అయిదుగురు కుమాళ్ళు. అందరిలో పెద్దవాడు మా తాత వెంకటసుబ్బయ్య గారు. మంత్రశాస్త్రంలో, సాహిత్యంలో అభినివేశం గలవాడు. ప్రతిదినమూ భారతం పారాయణ చేయనిది నిద్రించేవాడు కాడు. ఆయనముగ్గురు కుమాళ్ళలో మానాన్న వెంకటరామయ్య గారు పెద్దవాడు. ఆయన నూజివీడు హైస్కూల్లో ఆంగ్లవిద్య అభ్యసించాడు. ఆస్థానవిద్వాంసులు మా బంధువులు మంత్రివాది సూర్యనారాయణ శాస్త్రిల్లుగారి ఇంటివద్ద ఉండి మానాన్న హైస్కూలులో మెట్రిక్యులేషన్ చదివాడు.

మానాన్న పరీక్షలో నెగ్గలేదు. ధనాభావం వల్ల తిరిగి చదవడం జరిగిందికాదు. మా కుటుంబం పెద్దది కావడంవల్ల మొదటినుంచీ డబ్బుకు చాలాయిబ్బందిగా ఉండేది. అన్నివిధము లైనఖర్చులకూ, పొలంనుంచి వచ్చేఆదాయంమీద ఆధారపడవలసిందే.

మానాన్నకు మేనమామకూతు ర్నిచ్చి పెళ్ళి చేశారు. మాఅమ్మకు రెండేళ్ళవయ స్సున మాఅమ్మమ్మ చనిపోయింది. ఆమెకు అప్పుడు ౨౦ వత్సరాలు. మాఅమ్మ తండ్రి మంత్రివాది కామయ్య గారు. పోతుమర్రి అగ్రహారంలో ధాన్యవ్యాపారం వల్లనూ, వడ్డీ వ్యాపారంవల్లనూ ధన మార్జించి సుమారు 60 ఎకరముల మాగాని పొలం సంపాదించాడు.

౨

మా నాన్నకు ముగ్గురు పిల్లలం కలిగాము. మా అక్కయ్య, మా అన్నయ్య, నేను. మా అన్నయ్యఏడోయేట చాలా ఆస్తిపరుడు, గొప్పహోదా గలిగిన గూడవల్లి బ్రహ్మయ్యగారి కోరికమీద నందమూరుగ్రామం పాఠశాలలో మానాయనగారు ఉపాధ్యాయుడుగా చేరినాడు. అందులో బ్రహ్మయ్యగారి కుమాళ్లు, గ్రామంలో తదితర బాలురు చదువుకొనేవారు. నందమూరులో మాకుటుంబం శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారి యింట్లో కాపురం. అప్పుడు సత్యనారాయణగారు బందరులో మెట్రిక్యులేషన్ చదువుతుండేవారుట. సెలవులకు బందరునుంచి వచ్చి వారింట్లో ఒక భాగంలో వుండేవారు. విశ్వనాథవారి కుటుంబానికీ మాకుటుంబానికీ అమితస్నేహం. మా అన్నయ్యకు మానాన్నగారి పాఠశాలలోనే విద్యాప్రారంభం. చాలాచురుకుగా చదువుతూ వయసుకు మించిన భావాలు వెలిబుచ్చేవాడుట. నందమూరుగ్రామంలో రెండేండ్ల ఆరుమాసా లున్న తరువాత మానాన్న బ్రహ్మయ్యగారి పనులమీద గూడూరు ప్రాంతాలకు వెళ్ళవలసి వచ్చింది. అప్పుడు మేము పోతుమర్రిలో మేన మామలయింట్లో ఉండేవాళ్లం.

అన్నయ్యకు పన్నెండోయేట మళ్ళీ మానాన్న బెజవాడలో ఉద్యోగం సంపాదించు కుని అక్కడ కాపురం పెట్టాడు. నాన్న అన్నయ్యకు స్వయంగా చదువు చెప్పి బెజ వాడ మ్యునిసిపల్ హైస్కూల్లో నాలుగోఫారంలో చేర్పించాడు. మూడు మాసాలు చదివాడోలేదో, టైఫాయిడ్ జ్వరం వచ్చి, జీవించ డన్నంత గడబిడ చేసింది. అన్న య్యకు జ్వరం తగ్గగానే మా అమ్మ, తరువాత మామేనమామభార్య, వరసన నలు గురైదుగురు జబ్బుపడటంవల్ల మావాళ్లు మీ కీవూరు అచ్చిరాలే దని మమ్మల్ని మాఅమ్మమ్మగారింటికి తీసుకువెళ్లి దించారు.

3

మాగ్రామంలో శ్రీరామగ్రంథనిలయం వుండేది. అన్నయ్యకు అప్పుడు పదమూడో యేడు. ఆగ్రంథాలయంలో కనపడినపుస్తక మల్లా చదవడం ప్రారంభించాడు. భారతం భాగవతం మొదలైన గ్రంథాలుకూడా కొంచెం అర్థంచేసుకుంటూ, సులక్షణ సారం చదివి పద్యాలు వ్రాయడం ప్రారంభించాడు. అక్కడ ఒకసంవత్సరం ఉన్న తరువాత మానాన్న తెనాలిలో ఉద్యోగం కుదుర్చుకుని తీసుకువచ్చాడు మమ్మల్ని. ఆరోజుల్లో ఆంగ్లపాఠశాలాబహిష్కరణోద్యమం తీవ్రంగా ప్రారంభమయింది. అందుచేత అన్నయ్య తెనాలి తిలక్ జాతీయపాఠశాలలో చేరినాడు. అక్కడనే ప్రభల రామబ్రహ్మనందం, వేదాంతం సుబ్రహ్మణ్యములతో ప్రథమపరిచయం కలిగింది అన్నయ్యకు.

అన్నయ్య కవిత్వం చెప్పడం ప్రారంభించి తన కావ్యాలు పత్రికలకు పంపేవాడు. కృష్ణాపత్రిక, సాహితి, శారద మొదలైన పత్రికలు ప్రకటించేవి. ఆ సంవత్సరమే అన్నయ్యకు ఉపనయనం జరిగింది. ఇంకోనాలుగు మాసాలకు మా మూడవ మేనత్త కూతుర్నిచ్చి (మాకు ముగ్గురు మేనత్తలు) పెళ్ళిచేశారు. ఆ సంవత్సరమే మా పెద్ద పినతండ్రి వెంకట కృష్ణయ్యగారు - సంగీతోపాధ్యాయుడు - గుండెనొప్పి వల్ల మృతి నొందాడు. అన్నయ్య ఆయనమీాద 'పినతండ్రికి' అనే కావ్యం రచించాడు.
మాకు కొద్దిఎకరాల మాగానిభూమి వుండేది. సంసారం చిన్నదైనప్పటికీ మానాన్నకు జీతం కొంచెం కావడంవల్ల, వచ్చేపోయే బంధువులు ఎక్కువ కావడంవల్లా డబ్బుకు యిబ్బంది పడుతుండేవాడు. మా మేనమామలు ఆస్తిపరులైనప్పటికీ, మాసంసారా నికి వారినుంచి ఏసహాయమూ వచ్చేది కాదు.

కొంతకాలం గడిచింతరవాత తిలక్ జాతీయ పాఠశాల విడిచి తెనాలి సంస్కృత కళాశాలలో జేరినాడు అనయ్య. అప్పుడు పంచ్యారం వెంకటసుబ్బయ్యగారితో పరిచయం అయింది. ఆరోజుల్లో తెనాలిలో సాహితీ సమితి గొప్పస్థితిలో ఉన్నది. తరుచుగా కవులందరూ కలుసుకుంటూండడం జరిగేది. అన్నయ్య కావ్యాలు పత్రికలలో చదివి కొందరు సమకాలికులు అతన్ని చూడడానికి వస్తూండేవారు. జి. శేషాచారికి అన్నయ్య కవిత్వం అంటే ఎక్కువ అభిమానం. మాయింటికి ఆయన తరుచుగా వస్తుంటే ఒక రోజున మానాన్న ఆయన్ని అడిగాడు "మావాడు మీాకేమైనా డబ్బు బాకీవున్నాడా" అని. 'లేదు ఆయ నంటే నాకు అమిత ప్రేమ' అన్నాడు శేషాచారిగారు.

మాఅన్న విశ్వనాథ సత్యనారాయణగారంటే, ఆయనకవిత్వమంటే ఎక్కువ అభిమానం చూపించేవాడు. మిత్రుడు రామబ్రహ్మానందానికికూడా సత్యనారాయణ గారంటే ఎక్కువ అభిమానం. అన్నయ్యకావ్యాలలో అక్కడక్కడ సత్యనారాయణగారి పొగడలు కనిపిస్తయి.

1925 సంవత్సరం జమీందారుగారు రోకరు ఆధునిక కవులను నూజివీడుకు ఆహ్వానించారు. ఆసందర్భంలో మా అన్నయ్య మే నెలలో వెళ్ళాడు. ఆయన నూజివీడులో రచించిన కావ్యం ఒకటి ఉంది. 'అదిగో!' అనేది.

హృదయ నీలాభ్రి ధావిదంబుదకుమార
రేఖలునుకోలె మెఱసి పరిమళించి
పొరలు గట్టినగీతి కాంకురము లివిగొ !
తెలియ దేనాడు మొల్క లెత్తినవొ గాని !

1928 సంవత్సరం మాఖ శివరాత్రికి మాఅమ్మ ఐలూరు వెళ్ళి కృష్ణాస్నానం చేసి బడలికతో కాశ్రిపకు తిరిగివచ్చింది. అక్కడనుంచి కాలినడక మీద శ్రమతో పోతుమర్రి చేరి ఉపవాసం ఉండి, మర్నాడు బ్రాహ్మణ్ణి కొలిచింది. ఆమెకు జ్వరం ప్రారంభించి, టైఫాయిడ్‌లోకి మారి, ఫాల్గుణశుద్ధ ద్వాదశినాడు రాత్రి 7 గంటలకు పరలోకాని కేగింది. ఆమె మరణించడంవల్ల, అన్నయ్య జీవితంలో పెద్దమార్పు కలిగింది. జీవితం మీద అతనికి నిరాశ ఏర్పడ్డది. అమ్మ కర్మాంతగాలు అయిపోగానే నేనూ, అన్నయ్యా, నాన్న మా పెద్దమేనమామ మంత్రివాది వెంకట క్షేమయ్య (తెనాలిలో సినిమా వ్యాపారం) గారింటికి చేరాము.

అన్నయ్య భార్య అప్పటికే కాపరానికి వచ్చింది. ఆ సంవత్సరం అంగా అన్నయ్య 19 వ యేట కుమారుడు కలిగాడు.

౮

మా అన్నయ్యకు తరువాత ప్రభల చంద్రశేఖరం ఇంకా కొంతమంది సాహిత్య ప్రియులతో పరిచయం ఏర్పడింది. తెనాలిలో కొంతమంది మిత్రులు కలిసి 'యువకవి మండలి' అని ఒకటి స్థాపించారు. భారతుల మార్కండేయ శర్మగారు దానికి అధ్యక్షులు, ప్రభల చంద్రశేఖరంగారు కార్యదర్శి. 'యువకవిమండలి' తరఫున 'శకోదయ' అనే పత్రిక నడపాలని ప్రయత్నం చేశారు. అందుకు మా మేనత్తకొడుకు శిల్పి, మంత్రివాది వెంకటరత్నంచేత ముఖచిత్రంకూడా వ్రాయించారు. ఏ కారణంవల్లనో

'శకోదయ' ప్రచురణం సాగలేదు. యువకవి మండలిలో సభ్యులు ఎక్కువమంది ఉండేవారు కారు. పంద్యారం వెంకటసుబ్బయ్యశర్మ, ప్రభల రామబ్రహ్మానందం, పాపినేని వెంకటేశ్వరరావు, వేదాంతం సుబ్రహ్మణ్యం, మా అన్నయ్య అందులో సభ్యులు.

1927 సంవత్సరం అన్నయ్య అమ్మమీద ఒక Elegy రచించాడు. మా పినతండ్రులిద్దరి మరణాలతోనే కుంగిపోయిన మా అన్నయ్య హృదయం, మా అమ్మ మృతితో మరీ కుంగిపోయింది. ఆమె మరణానంతరం మమ్మల్ని మనసార ఆదరించేవారు లేకపోయినారు.

> ద్వాదశినాటిరేయి జలదమ్ములు మూగి సుధార్ద్రచంద్రికా
> మేదురవీథి నెప్పు డలమెన్ దలపోతల దాటి నాడె శూ
> న్యోదయ దిక్తటమ్ములను ఒక్కతరిన్ బడిపోతి జన్మజ
> న్మోదితపుణ్య సంచయము నొక్కటి కొక్కటి నిష్క్రమించినన్

అని వాపోయినాడు. 'శోకగీతి' అనే కావ్యంలో

> ఈనైరాశ్యనిశాంధగహ్వరము లేలించున్ మహాదుఃఖ సం
> తానమ్ముల్ నడయాడు జీవిత విషాదధ్వాంత సంచారితన్
> ప్రాణమ్ముల్ పసివాళ్లు వాడినవి!

అన్నాడు. ఇంకోచోట

> మము నిదుర బుచ్చి అమృతరాగము స్రవించు
> జోలలను పాడి నీ చనుబాల నిచ్చి
> ఇన్ని నాళులు బ్రతికించి ఇప్పు డేగి
> యేడ్వ వల దన్న నెట్టుల యేడ్వకుందు?

అన్నాడు. ఆసంవత్సర మంతా ప్రతిపండగప్పుడూ మాఅమ్మ జ్ఞాపక మొచ్చి అన్నయ్య కొన్ని కావ్యాలు రచించాడు. ఆయనకవిత్వంలో అనేకరసవత్తరఘట్టాలు ఈ Elegy లో ఉన్నవి.

'శ్రావణాశ్రువులు' అనేకకావ్యంలో—

> మరల వచ్చెను శ్రావణమాసలక్ష్మి
> తొలగె దిక్తటులందు మాధుర్యవృష్టి

నీలపాథోధరాగ్రమందిరములందు
తాండవించెను విద్యుల్లతామతల్లి!
భూమితలగతసౌదామినీమనోజ్ఞ
మధురమూర్తులు శ్రావణమాసవేళ
శాంకరీపదాబ్జాత పూజాప్రసాద
ములు గ్రహించి పుణ్యాంగనల్ వెలిగినారు.
దివ్యమాహేశ్వరీపదాన్తికములందు
మోడ్పు కనుదోయి తోడుత మోకరిల్లి
వినతులొనరించు మాయమ్మ కనబడదట
చర్మచక్షుస్సులక్ష్య విశ్వమునయందు!

ఈ 'మాతృదేవి' అనేకావ్యం చదివితే కరుణారసము నిష్పన్నమవుతుంది. ఇందులో మొదటినుంచీ చివరవరకూ కవియొక్క ఆధ్యాత్మికదృష్టి గోచరిస్తుంది.

'పాథేయము' అనే కావ్యంలో.

అలసిపోతివి మందబుద్ధులను జేరి
కలసిపోతివి యామినీగర్భమందు
ఆయనంతనిర్వాణరాహస్యశయ్య
విశ్రమింపుము! నాతల్లి! విశ్రమించు.

ఏజన్మమందో దురదృష్ట మేచి వచ్చి
తల్లిలేనిబిడ్డల జేసి వెళ్ళిపోయె
కర్మఫలములు వేయిలక్షలును వచ్చి
హృదయపటమున నిన్ను మాయింపలేదు!

ఇంకోచోట మాతృప్రేమను ఎంతగొప్పగా వర్ణించాడో గమనించవలె.

మరల కనుపించబోదు కావలయు నమృత
వాహినుల పుట్టినిల్లు, జీవనపుటాశ
మా ఉపాస్యదైవతము మామాతృదేవి
నిరవధిక మైన కాలమందిరములోన!

ఆ జగత్కర్తకన్న నీయమలపాద
నీరజములు పునఃస్మరణీయము లగు
నాకు !

అన్నాడు 'పూజ' అనేకావ్యంలో.

౫

మా అన్నయ్య బెజవాడ మ్యునిసిపల్ హైస్కూల్లో నాల్గోఫారం మూడుమాసాలు చదివి మానేసి తరవాత స్వయముగా ఇంగ్లీషుపుస్తకాలు చదివి భాష అభివృద్ధి చేసుకున్నాడు. Modern Review, Triveni, ప్రతి సంచికలో ప్రతి వ్యాసము జాగ్రత్తగా చదివేవాడు. ఇవికాక South Indian Research చదివే వాడు. కన్నడ వాఙ్మయములోని ఆంధ్రకవులనుగూర్చి కృషిచేయడంకోసం కన్నడపత్రికలు పరిశీలిస్తూ ఉండేవాడు. Heritage of India Series గ్రంథాలు, హిందూమత సంబంధమైన గ్రంథాలు చదువుతుండేవాడు. ఇంతేకాకుండా, తెనాలిలో, మతుకుమల్లి నరసింహారావుగారు అనే తత్వవేత్త ఉన్నాడు. ఆయన అంధుడు. మాఅన్నయ్య ఆయన దగ్గరకు వెళ్ళి, Plato, Aristotle, Spinoza ఇత్యాదుల గ్రంథపఠనంలో కాలం వినియోగిస్తూ తీరిక ఉన్నప్పుడు కావ్యాలు కాగితంమీదకు ఎక్కించేవాడు. కొంతకాలం నన్నెచోడుని కాలనిర్ణయంగురించి కృషిచేశాడు; అది పూర్తికాలేదు. దేశ్యపదనిఘంటువు ఒకటి తయారుచేయా లని 'గ' వరకు వ్రాసుకు వచ్చాడు.

అన్నయ్యకు తెలుగుభాషన్నా, తెలుగువాళ్లన్నా ఎక్కువ అభిమానం. అందు చేతనే 'తెలుగుపాట' ల్లో.—

'తెలుగుతల్లికై చచ్చిపోయెదను
తెలుగుతల్లి కందిత్తు జీవములు
తెలుగుసోదరులె దేవులు నాకూ !
తెలుగువాడ నేను
సంపద
గలుగువాడ నేను'

అన్నాడు. పలుకులో, క్రియలో తనమాతృదేశభక్తిని చూపి ధన్యుడైనాడు. వెంకటరత్నం నియమంగా ఖద్దరు ధరించేవాడు. మిక్కిలి నిరాడంబరుడు. చామనచాయ శరీరం. పిలకజుట్టు. ఆస్తికుడు.

ఎంత స్వల్పవస్తువు నైనా తనకావ్యాలలో రమణీయంగా చిత్రించేనైపుణ్యము గల శక్తిశాలి. ఈయనకావ్యాలలో ఈశక్తి చాలాతావుల కనుపిస్తుంది. ఉదాహరణకు, 'తాళీవని'లో

ఈయుగాంతరజీవు లెన్నెన్నిమార్లు
ఆశలను పెంచుకొనిరో దిగంతములకు
పాత్రిక లేని యాశల తలపై ధరించి
యిల నిలంబడు శీతోష్ణములు సహించి.

చివరి రెండుపాదాలు ఎంతరమ్యంగా వున్నాయి!

'పాద' మిత్రుడి మరణానంతరం వ్రాసినది.

అతడు నే డొక కంటకావృతవికీర్ణ
మైన పాదరూపమున జన్మ మందినాడు!

'కోయిల'లో

నన్ను గొనిపొమ్ము! నీదు గానంపు పథిని
వత్తు నిదిగో! శారీరక పక్షయుగళి
నెగురజాలన భావనా మృదురథంబు
నడపెద నసంత మధురగానములతోవ
ఎగిరివత్తునులే! యుగవిగమవేళ
నిన్ను గూడి మాధుర్యముల్ నింపుకొరకు.

'పద్యాలు' అనేదానిలో-

అభము శుభము నెరుంగనియట్టినాడె
వలచి వచ్చిరి, మాలికాంచలముగూర్చి
ఆడుకొన్నాను నైజసౌహార్దగతుల.

అన్నాడు. 'పద్యాలు వలచివచ్చినవి'. ఇటువంటివి ఈకవిరచనలో అనేక మున్నవి. 'కవిత' అనేపత్రికలో ఎవరో 'తరవాణి' అని పద్యాలు వ్రాస్తే మాఅన్నయ్య 'ఆవకాయ' అని చమత్కారంగా పద్యాలు వ్రాసి ఆపత్రికలోనే ప్రచురించాడు. తరువాత 'చెడుగుడు' అనేకావ్యం ఒకటి. చెడుగుడు అనేది ఒకఆట. అందులో ఆటగాళ్లు చచ్చి బ్రతుకుతుంటారు. ఇది అందులో వస్తువు.

ఈయన ఈ ౨౦ ఖండకావ్యాలే గాక అనువదించినవి కొన్ని ఉన్నవి. సంస్కృతకవి మహాదేవుని 'అద్భుతదర్పణ' నాటకము తొమ్మిది అంకములు అనువదించాడు. Anatole France యొక్క Thais ఆంగ్లానువాదాన్ని తెలుగులోకి కొన్ని పేజీలు మార్చినాడు.

1928 మార్చిపరీక్షలో అన్నయ్య 'ఉభయభాషాప్రవీణ' Entrar ce Examination పాసయ్యాడు. ఆసంవత్సరం మిత్రులు ప్రభల రామబ్రహ్మనందం, వేదాన్తం సుబ్రహ్మణ్యం Benares Hindu University Matriculation పరీక్షకు చదువుతున్నారు. డిగ్రీలు లేనిపాండిత్యంబు వన్నెకురా దని మాఅన్నయ్యకూడా మెట్రిక్యులేషన్ పరీక్షకు చదవడం ప్రారంభించాడు. పగలు 11 గంటలనుంచీ సాయంత్రం 5 గంటలవరకూ సంస్కృతకళాశాలలో చదువు. ఉదయం, రాత్రి, మిత్రుడు రామబ్రహ్మనందంఇంటివద్ద మెట్రిక్యులేషన్ పరీక్షకు చదవడంవల్ల కావలసినంతవిశ్రాంతి ఉండేది కాదు. మాఅమ్మమరణానంతరం అన్నయ్యకు జీవితంమీద ఎక్కువ నిరాశ కలిగింది. సంసారంలోకూడా ఆయనకు ఆనందం సంప్రాప్తం కాలేదు. దేహానికి విశ్రాంతి లేకపోగా, మనసుకుకూడా రవంతశాంతి లేకపోయింది. విధిలిఖితము ఆవిధంగా ఉం దని పద్యాలలో వ్రాసినాడు. 'సబ్రహ్మచారి' అనేకావ్యంలో "నిర్దయ మావిధిన్ కఠిననింద యొనర్చుట నాల్కచేటు" అనుకున్నాడు.

అన్నయ్యకు తన ఆరోగ్యంగూర్చి ఎక్కువశ్రద్ధ ఉండేది కాదు. అతనికి తరుచుగా జబ్బు చేసేది కాదు. మామూలుగా తిని తిరుగుతుండేవాడు. సంగీతం పాడేవాడు. రామభజన జరిగితే అక్కడికి మేము తప్పక వెళ్ళేవాళ్లము. మాఅన్నయ్య తరంగాలు, కొన్ని రామదాసుకీర్తనలు సరదాగా పాడేవాడు. వాళ్ల కాలేజిలో 'ముద్రారాక్షసము' సంస్కృతంలో ప్రదర్శించినప్పుడు, అందులోనూ పాల్గొన్నాడు.

మా అన్నయ్య ఎక్కువగా 1928, 29 సంవత్సరాలలో ఖండకావ్యాలు రచించాడు. ఆ కావ్యాలన్నీ ఒక క్రొత్తమార్గాన ఉన్నవి. వాటిలో కథావస్తువు తన జీవితమే. జీవితము దుఃఖభూయిష్ఠ మైపోయిన తరువాత, అతనికి తన మరణము లీలగా గోచరించసాగింది. మరణానంతరంకూడా ఈ ప్రపంచం ఈ ప్రకృతి ఈవిధంగానే గడచిపోతవి. అత నీ ప్రపంచంలో లేనిలోపం కనపడదు. 'సంధ్యాగీత' అనేకావ్యంలో—

నాడుగూడ గభీరవిభావరీ ని
శాంతశయ్యా ప్రసన్నమాధుర్యమూర్తి

ప్రేమ దేవత కారాధనములు జరుగు !
నేనె యుండనిలోపము కానరాదు !

అన్నాడు. 1928, 29 సంవత్సరాలలో అన్నయ్య రచియించిన ఖండకావ్యాలలో ముఖ్యమైనవి: శకుంతల - సృష్టి - మానవుడు - అడవిపూవు - ఎడారి - ముందుగతి - సమస్య - వీటిలో కొన్ని భారతిలో పడినవి. కొన్ని 'వైతాళికులు' లో ప్రచురించారు.

1929 ఫిబ్రవరి ఆఖరున మిత్రులు ప్రభల రామబ్రహ్మానందం, వేదాన్తం సుబ్రహ్మణ్యం, అతని తమ్ముడు లక్ష్మీనారాయణ, శరభయ్యగార్లతో కలిసి మాఅన్నయ్య మెట్రిక్యులేషన్ పరీక్షకు కాశీ ప్రయాణమై వెళ్లాడు. కాశీలో మిత్రులు అంతా కలిసి హనుమాన్ ఘాట్ లో ఇల్లు అద్దెకు పుచ్చుకున్నారు. బ్రహ్మానందం తల్లిగారిని కూడా తీసుకువెళ్లాడు. సరిగా పరీక్షలు ప్రారంభం కాగానే, బ్రహ్మానందానికి జ్వరం, దగ్గుతో క్షయవ్యాధి ప్రారంభ మయింది. ఆ సంవత్సరం కాశీలో Cold wave వచ్చిందని తరవాత తెలిసింది. అతను పరీక్షకు వెళ్ళలేకపోయాడు.

మాఅన్నయ్య మిత్రులు పరీక్షలు అయిపోయింతరవాత పురాణకాశీ, వ్యాసకాశీ, మొదలైన ప్రదేశాలు చూసి ఏప్రిల్ 11 తేదీన బయలుదేరి కలకత్తా వచ్చారు. క్రమేణ తెనాలి చేరుకున్నారు. నే నాపూజురాత్రి తెనాల రైలుస్టేషనికి వెళ్ళాను, అన్నయ్య వస్తాడని ముందుగా తెలిసి. రామబ్రహ్మానందానికి తెనాలి వచ్చింతరవాత కూ ఏమీ తగ్గలేదు. అతన్ని చూడడానికి ప్రతిదినం అన్నయ్య వాళ్ళింటికి వెళ్లుతుండేవాడు. అతనికి జబ్బు అంతకంతకు ఎక్కువై పోయింది. 1929 జూన్ పద కొండవ తేదీన రామబ్రహ్మానందం పరలోకాని కేగాడు. అన్నయ్య అతనికోసం ఎంతో దుఃఖించాడు. అతనిమీద 'పోద, మిత్రస్మృతి' అను రెండుకావ్యాలు రచించాడు.

౭

అన్నయ్యకు పుస్తకా లంటే అమితప్రేమ. కాశీ వెళ్ళేముందు తనపుస్తకాలు మా చుట్టాల యింట్లో బీరువాలో పెట్టాడు. చెదలు పట్టి, కొన్ని పూర్తిగా పాడయి పోయినయి. ఎంతో విచారించాడు వాటికోసం. పుస్తకాలనుగూర్చి ఇంగ్లీషులో రెండు పాదాలు రచించాడు.

Books are the souls of the bygone ages,
They are mortal dreams, immortalised.

అన్నయ్యకు ఇంగ్లీషు కవిత్వమంటే ఎక్కువ అభిమానం. షెల్లీ 'అడొనిస్', ఫిట్జరల్డ్ అనువదించిన 'రుబాయియాత్ ఉమర్ ఖయ్యాం, దివాన్-ఇ-జేబున్నీసా' తరుచుగా చదువుతుండేవాడు. హరీంద్రుని Ancient Wings మొదలైనవి కూడా చదివేవాడు.

ఆయనకు ఇంగ్లీషులోకూడా కావ్యాలు వ్రాయాలని కోరిక ఉండేది. దువ్వూరి రామిరెడ్డిగారు తనకావ్యాలు ఆంగ్లములోకి అనువదించి Voice of the Reed అనేగ్రంథంగా ప్రకటించారు. అన్నయ్యనోటుబుక్కులో తన'ముందుగతి', 'నామురళి' అనేవి రెండు ఆంగ్లంలోకి అనువదించివున్నాయి. అప్పటికి తెలుగుకవులు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'ఈయడవి దాగిపోనా', విశ్వనాధ సత్యనారాయణగారి 'నారధము' ఆంగ్లములోకి వెళ్ళి త్రివేణిలో అచ్చుపడినాయి. అన్నయ్య అనువదించినవి Triveni కోసమో లేక గ్రంధరూపంగా వెలువరించడానికో తెలియదు.

మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసయ్యాడు. ఉభయభాషాప్రవీణ ఆఖరువత్సరం చదివి పరీక్షకు వెళ్లాలి. పూర్తి అయింతరవాత, ఏహైస్కూల్లోనైనా ఉపాధ్యాయుడుగా ప్రవేశించి, కొంతకాలం గడచినమీద ప్రైవేటుగా బి.ఏ. ప్యాసుకావాలనుకున్నాడు. అతనికి జీవితంలో తృష్ణ ఎక్కువయింది. తనవయసుకు, తనఆరోగ్యానికి, తనకున్నఅవకాశాలకూ మించినభావాలను మనసులో పెట్టుకుని, అవి ఫలించడంకోసం రాత్రింబవళ్లు కృషి చేయడం ప్రారంభించాడు. అందుచేతనే 'అంజలి'లో— 'జీవన మెల్ల తృష్ణ విరచించిననాటక మయ్యె నాకు' అన్నాడు. అతనికి జీవితంలో ఒకటీ నిలకడతో ఏర్పడలేదు. కవిత్వము చెప్పుకున్నప్పటికీ ఇతరవిషయాలలో కృషిచేయడం మానలేదు. మనసుకు విశ్రాంతిలేదు. సరైన ఆహారము వేళకు తీసుకొనేవాడు కాడు. కాశీనుంచి వచ్చినతరువాత ఏమీ మందు పుచ్చుకోలేదు. క్షయవ్యాధి అంటువ్యాధని ప్రసిద్ధి. ఈసంగతి తెలిసికూడా అన్నయ్య రామబ్రహ్మానందం వద్దకు ప్రతిదినం రెండుసార్లు వెళ్లేవాడు.

౮

ఆసంవత్సరం వినాయకచవితి మరుసటిరోజున అన్నయ్యకు జ్వరం ప్రారంభ మయింది. ఆరోజుల్లో మానాన్న ముదునూరుగ్రామంలో ఉపాధ్యాయుడుగా ఉండేవాడు. జ్వరం ప్రారంభించినకొత్తలో అన్నయ్య సరిగా మందు తీసుకుని పత్యం చేసేవాడు కాడు. భార్య పుట్టింటికి వెళ్లడంవల్ల మందు పుచ్చుకుంటూ స్వంతంగా వంటచేసుకుని కాలేజీకి వెళ్లేవాడు. జ్వరము వారానికి ఒకసారి వస్తుండేది. అశ్రద్ధ చేయడంవల్ల డిసెంబరుమాసం ప్రాంతాలకు జ్వరంతోపాటు దగ్గుకూడా ప్రారంభ మయింది.

అప్పటినుంచీ శ్రద్ధగా మందూ ఆహారం తీసుకోవడం ప్రారంభించాడు. మేమంతా కాపరంగా తెనాలి రామలింగేశ్వరపేటలో వుండేవాళ్లము. నాన్న ముదునూరు నుంచి ఉద్యోగం మానేసి వచ్చేశాడు. అన్నయ్యకుమారుడు వెంకట లక్ష్మీపతి పుట్టుబుద్ధులతండ్రి! మాటలు వచ్చినప్పటినుంచీ వాడికి చదువుకోవాలనీ, బళ్లోకి పోవాలనీ ఒకటే కోరిక. అన్నయ్యకు కుమారుడి మీద అత్యంత ప్రేమ. కాశీలో చదివేరోజుల్లో, ప్రతిపుత్తరంలో 'అబ్బాయి ఈ లక్ష్మీపతి ఆరోగ్యం జాగ్రత్త. వాడిని బావిదగ్గరికి పో నివ్వద్దు. అని వ్రాసేవాడు. లక్ష్మీపతి అన్నయ్యవలెనే చామన చాయగా వుండేవాడు.

అన్నయ్యస్నేహితుడు వేదాన్తం సుబ్రహ్మణ్యం గుంటూరులో ఆంధ్రక్రిస్టియన్ కాలేజిలో ప్రవేశించిన రెండుమాసాలకు క్షయవ్యాధి ప్రారంభ మయింది. అతను మద్రాసు వెళ్లి అక్కడ X-Ray Examination చేయించుకుని బందరులో మందు పుచ్చుకుంటూ అన్నయ్యను కూడా X-Ray Examination చేయించుకోవలసిం దని ఉత్తరం వ్రాశాడు.

మావాళ్లు ఆ ప్రయత్నము చెయ్యలేదు. తెనాలిలోనే ఒక రయింతరవాత ఇంకొకరి వద్ద మందు ఇప్పించారు.

అన్నయ్య జబ్బులోకూడ ఏదో ఒకటి వ్రాస్తూ చదువుతూ ఉండేవాడు. 'ప్రార్థన- నిశాభావన- నాతోడినబ్రహ్మచారి- అంజలి- సంధ్యాగీత- స్వేచ్ఛాగీత- సెలయేరు- మిత్రస్మృతి- ఫలశ్రుతి' వంటి ఉత్తమ కావ్యాలు జబ్బులో వ్రాసినవి.

1930 సంవత్సరం సత్యాగ్రహోద్యమం విజృంభించింది. అన్నయ్య జబ్బులోకూడా ప్రతిదినం పత్రిక చదువుతుండేవాడు. మామేనత్తకొడుకు, శిల్పి, మంత్రివాది వెంకట రత్నము ఆసంవత్సరం జైలుకు వెళ్ళాడు. తనకు జబ్బుచెయ్యకుండా వున్నట్లయితే తనుకూడా తప్పకుండా జైలుకు పోయేవాడినని చెప్తుతుండేవాడు అన్నయ్య.

నానాటికి క్షయవ్యాధి ఎక్కువయింది. సాయంత్రం ఏడు గంటలనుంచీ 102 డిగ్రీల జ్వరం. శరీరమంతా భరించ శక్యముకాని నొప్పులు. ఒకటే ఆవేదన. పొద్దు కుంకుతుం దంటే, భయపడేవాడు. అతనికి జీవితంమీద ఆశ యెక్కువైంది. ఈ క్షయ వ్యాధి ఎక్కువై తను మరణించటం నిశ్చయ మని అతనికి గోచరించింది. 'ప్రార్థన' అనే కావ్యంలో—

నీ వెట దాగినా వనుచు నేను భ్రమింపగలాడ నయ్య ! నా
చేవయు లావు దక్కి, యిటు జీర్ణత పొంది, నిరంత మాధిబా

ధా వశగామి నైతిని, పదంబుల శక్తియు లేదు, నీవెసూ
రావలె, నీదె భార మిక రాయిడి సేయకురా ! హృదీశ్వరా !

అని దేవుణ్ని ప్రార్థించాడు.

౯

తొలకరి వచ్చింది. అన్నయ్య అంతకంతకు క్షీణించాడు. తెనాలిలో జబ్బు తగ్గని కారణంచేత, మేము తెనాలినుంచి కాపరంగా బెజవాడ వెళ్లాము. 1930 జూలై మాసంలో మానాన్న నన్ను బెజవాడ హిందూహైస్కూల్లో స్కూల్‌ఫైనల్ క్లాసులో చేర్చాడు. అన్నయ్యకు జబ్బు తగ్గుతుం దనీ, బెజవాడలోనే ఉండిపోవచ్చు ననీ మా నాన్న ఆశపడ్డాడు.

జూలై మాసంలోనే అన్నయ్యకు నీరు చూపింది. ఆయాసము ప్రారంభమైనది. ప్రతిరోజూ వైద్యుడు చెప్పిన ప్రకారం తైలం ఒకటి నేను పాదాలకు రుద్దుతుండే వాణ్ని. ఆగష్టు నాలుగవ తేదీ, సోమవారం రోజునకూడా, తైలం రాచి 10 గంట లకు నేను స్కూలుకు వెళ్లాను. నేను స్కూల్లో ఉండగానే మిత్రుడు వచ్చి, మీ అన్నయ్యకు రక్తంవాంతి అయింది. మీవాళ్లు నిన్ను తీసుకుర మ్మన్నారు అన్నాడు. నేను ఇంటికి వెళ్లేటప్పటికే అన్నయ్య ప్రాణాలు విడిచాడు! ప్రాణాలు విడిచేముందు 'అబ్బాయి యేడీ?' అని అడిగాడట. తుదిమాటలుగా నాతో ఏమైనా చెప్పేవాడేమో! ఆమహనీయుడి అంతిమవాక్యాలు వినేఅదృష్టం నాకు లేకపోయింది!

అన్నయ్యకు జబ్బుగా ఉప్పుడే అతని నాలుగేండ్లకుమారుడికి టైఫాయిడ్‌జ్వరం ప్రారం భమైంది. అన్నయ్య పోకముందే పిల్లవాడికి సంధించింది. అన్నయ్య తను మరణిం చటం నిశ్చయ మని, 'అబ్బాయిని జాగ్రత్తగా చూడండి' అనేవాడు. కాని దైవఘటన వేరుగా ఉంది. అన్నయ్య పోయిననాలుగురోజులకు శ్రావణపౌర్ణమినాడు రాత్రి 12 గంటలవేళ అన్నయ్యకుమారుడు వెంకట లక్ష్మీపతి మృతినొందాడు.

1936 సెప్టెంబరుమాసంలో పక్షంవాతంతో బాధపడి మానాన్న పరలోకాని కేగాడు.

౧౦

అన్నయ్యజననం 1907 నవంబరు. మరణం 1930 ఆగస్టు.

ప్రతిజీవి ఎప్పుడో ఒకప్పుడు చావక తప్పదు. కాని బ్రతికివున్నన్నాళ్లూ, అదృష్ట వంతుడు సాధించ దలచుకున్నది సాధించి పోతాడు. దురదృష్టవంతుడు మాఅన్నయ్య వలె ఒకమెరుపు మెరిసినట్టు మెరిసి మాయ మౌతాడు!

# హేమ పుష్పిక

## అంబటిపూడి వెంకటరత్నం

విచ్చిన మొగ్గలెన్నొ కనిపించెడు ఈ సుమవాటిలోన నా
నచ్చిన పూవు నాకయిన నాడు కదా జనిసార్థకమ్ము; కా
వచ్చెను దేవపూజకు నుపక్రమవేళ; పినాసి తోటవా
డిచ్చునొ లేదొ నాదెసకె యించుక వంగిన హేమపుష్పికన్!

అది నాకే యిడునేని భద్రముగ నిద్రాహారముల్ మాని వా
ని దయన్ ముందుగ సంస్తుతించి పయనింతున్ దోయిటన్ పూవుతో;
పథమం దల్లుచు గీతికల్ ననకు నేర్పంగావలెన్: ముందు దే
వ దయాసిద్ధికి బూజసేయుచును నే బాడింతు నా పూవుచేన్.

పూలకు వచ్చి నిల్చిన ప్రబుద్ధులు లెక్కకు మీరినార, లిం
కేలనొ తోటకాపు గళమెత్తడు రమ్మన డొక్కనిన్; అదో
జోలెల బోయు నొక్కొకని జూచుచు బిల్చి; వనంబు దాటి రే
గోలయు లేదు; నన్ బిలువగోరడొ! ఆ సుమ మల్లె నిల్చెబో!

ఎంతకు చూడ డీదెస కి కెంతటి కాలము వేచియుందు; నే
మంత ప్రలుబ్ధుడో! తనజనాళికి కోసి యొసంగునో! దినం
బెంతొ గతించుచుండె; నిపు డేమిది యేమిది హోరుగాలి; ఆ
వృంతము వీడెరా పువు! తపించుచు గాలికి వచ్చు నర్రెరే!

"ఓ నా చక్కనిపూవ! పో దలపు నా కున్నన్ ఎదో సాగనీ
దే! నిల్వంబడి నిన్ను జూచుట తపస్సే సుమ్ము! కాకున్న నీ
వీ నా దోయిట వచ్చి వ్రాలుదువె! దైవేష్టమ్ము నాభాగ్యమున్
నీ నిర్మాణఫలమ్ము మూ డొకటిగా నిర్దిష్టమై యున్న వే!"



# నిశ్చయము

**వట్టికొండ రంగయ్య**

ఆమెదీనస్థితిం గనులార గాంచి
కనుగొనలయందు జాలిచే గ్రమ్ముచున్న
అశ్రుకణముల నెట్టులో నణచికొనుచు
కొంతసే పట్టె చూచుచు గూరుచుంటి.
పిదప మెలమెల్ల చలన మావిర్భవించి
మానసం బంత డోలాయమాన మయ్యె,
సంశయాచ్ఛాదితాధ్వసంచారవశత
స్తిమిత మావంత గల్గ దీచిత్తమునకు.
ఈమె కీయెడ ప్రత్యుక్తి యేమి చెప్పుదు
అకట! ఏమి చెప్పుటకు నోరాడ దాయె
తన్వి నెట్టులు నే సమాధానపరతు
అనుచు యోజించినాడ రవంతసేపు.
ఎవ్వతె నాత్మలో నభిలషింతునో పిన్నటనాటనుండియున్
ఎవ్వతెవైదుషీగరిమ నెప్పుడు శ్లాఘన చేయుచుందునో
ఎవ్వతెయందు నామది లయించి విముక్తిని జెందజాలదో
అవ్వనజాక్షి నిప్పు డకటా! విడనాడి సుఖింప జూతునే!
ఏలలితాంగిసద్గుణము లెల్లపుడున్ మది మెప్పు గూర్చునో
ఏలలితాంగిరూపు కనిపించునో కన్నుల గట్టినట్టుగా
ఏలలితాంగి నాకయి త్యజించునో భర్తను తల్లిదండ్రులన్
ఆలలితాంగి బాసి కఠినాత్ముడనై చరియించు టొప్పునే!
ఏయువతీమతల్లిహృదయేచ్ఛలు సాంఘికమార్గదర్శక
ప్రాయములై విరాజిలునో ప్రాజ్ఞజనస్తుతిభాజనంబులై
ఏయువతీమతల్లి హృదయేశ్వరుగా నను నమ్మియుండెనో
ఆయువతీమణిన్ విడిచి అయ్యో! కృతఘ్నుడనై చరింతునే!
ఐనను జెప్పిచూచెద నవాంబురుహాక్షికి మేలుకీడులన్
ఐన సరే యటంచు మనసార సఖీమణి మారు పల్కినన్

దీన తదీయనిశ్చయము తేటపడంగల; దింకమీద నే
పూనిక భావికార్యములపొంతకు బోదును ధీరవృత్తిమై.

అని తలపోసి పోసి కుసుమాసవ మొల్కు గభీరవాక్కులన్
అనునయవృత్తి స్మేరవదనాంబుజ మల్లన నెత్తి మెల్లగా
ఘనతరసంశయాంబునిధి గాఢనిమగ్నహృదంతరాళసం
జననని కామభావపరిణామవధూమణిగూర్చి పల్కెతిన్.

"మన్మనోరాజ్యలక్ష్మి, నామాట వినుము
పరిణయముమాట తలపెట్ట భావ్య మగునె?
సంతతం బీవు సాహిత్యసరసగోష్ఠి
జ్ఞానలబ్ధికై కాలమ్ము గడపుమమ్మ!
లలన, భవదీయశ్రేయోభిలాషి యైన
ప్రియుడు గలుగంగ నీ కింక భయ మదేల?
ప్రణయగీతలు ప్రేమతో పాడుకొంచు
అతితరానందలహరి నోలాడు మమ్మ!"

# ఎవతెవో!

**సింగరాచార్యులు**

ఈయుషస్సుల మందహాస రాగము లంది
ఈమంచుజల్లు చల్లని చూపుల కడింది
ఎవతెవో కలికి! చల్లగ పలుకరించేవు!

శ్వాసించి వలపుపాటలగాలి పూరించి
పక్షిమూకల ముద్దుకలకలమ్ము శ్రుతించి
ఎవతెవో కలికి! చల్లగ పలుకరించేవు!

అళినీలమేఘ వేణీనభస్సుల కళుకు
అలకల నిగార మీయేటి తరగల తళుకు
ఎవతెవో కలికి! హాయిగ పలుకరించేవు!

నాయెడంద జ్వాలకును కాంతి కల్పించి
నాబ్రతుకు బరువు తేలికపరుప యత్నించి
ఎవతెవో కలికి! తీయగ పలుకరించేవు!

ఈమనస్సువ నిదురవోవు వలపుల రేపి
ఈయాత్మ కానంద నవజీవనము పోసి
ఎవతెవో కలికి! ప్రేమను పలుకరించేవు!

కళల శృంగాలు నీయంగ విన్యాసాల
నన్ను ముగ్ధునిజేయ యత్నించి వలపించి
ఎవతెవో కలికి! ఈయింట వెలుగైనావు!

# సాహిత్యంలో కలగవలిసిన మార్పు

**కొడవటిగంటి కుటుంబ రావు**

సాహిత్యం ద్వారా సాధించదగిన ప్రయోజనం ఏది అనుకున్నప్పటికీ ఏకాలంలో నయినా సాహిత్యంలో కలగవలిసిన మార్పు జీవితంలో కలుగుతున్న మార్పును అనుసరించే ఉంటుంది. ఏయుగంలోగాని ఏకవిగాని తన కాలపు జీవితంతో సంబంధం లేని రచన చేశా డనుకోవటానికి ఆధారం లేదు.

సాహిత్యం యొక్క ఆశయం నీతిబోధ చెయ్యటమూ, ఆధ్యాత్మిక ప్రబోధ చెయ్యటమూ అనుకున్నప్పటికీ, సాహిత్యం తన కాలంలో ఏనీతి, ఏఆధ్యాత్మిక విజ్ఞానమూ లోపించిన వనుకుంటుందో వాటినిగురించే బోధ చేస్తుంది.

సాహిత్యం సృష్టించటమూ చదవటమూ కేవలం సాహిత్యకళారాధకొరకే ననుకున్నా సాహిత్యశిల్పం కాలక్రమాన అభిరుచులలో కలిగే మార్పునుబట్టి మార్పు చెందుతూ ఉండాలి.

సాహిత్య ప్రయోజనం జీవితాన్ని విమర్శించటమూ అలంకరించటమూ అనుకున్నట్టయితే సాహిత్యంలో కలగవలిసినమార్పు జీవితంలో కలుగుతున్న మార్పునుబట్టి ఉండటానికి ఏ అభ్యంతరమూ లేదు.

సగం జీవితం గ్రంథపఠనలోనూ మిగిలినది గ్రంథరచనలోనూ గడిపి జీవితాన్ని తెలుసుకోవటం మరిచిన వాడిరచన ఎంత దౌర్భాగ్యంగా ఉంటుందో మనం సులభంగా ఊహించవచ్చును. కేవల సదుద్దేశా లెందుకూ పనికిరావు. సంఘములో లేని లోపాలను సంస్కరించే సదుద్దేశంతో రచనచేసేవాళ్ళూ, ఉన్న లోపాలను సరిగా అర్థం చేసుకోకుండా, వాటి కుదుళ్ళూ వేళ్ళూ ఎక్కడ ఉన్నవో తెలుసుకోకుండా సంస్కరణాభిలాషులై ఉత్సాహంకొద్దీ రచనచేసేవాళ్ళూ, తమకంటెకూడా అజ్ఞానుల చేత మంచి రచయిత లనిపించుకో గలిగినా కాలక్రమమున బయటపడక మానరు. ఆ రచనవల్ల వ్యక్తులకు గాని సంఘానికిగాని ప్రయోజన మేమీ ఉండదు.

స్త్రీలకు స్వేచ్ఛకోరేవారూ, మగవాడి దౌర్జన్యాన్ని నిరసించేవారూ, విడాకుల చట్టాలను సమర్థించేవారూ, భాగ్యవంతులను నిందించేవారూ తాము కోరిన సంస్కరణలు

జీవితంలో ప్రవేశపెట్టితే ఏం జరుగుతుందో స్పష్టంగా అర్థంచేసుకుని రచన సాగిస్తే చాలా బాగుంటుంది. అది అర్థం చేసుకోవటానికి వారికి జీవితాన్నిగురించి సంపూర్ణంగా అర్థం చేసుకునే శక్తి ఉండాలి.

సంస్కరణలు కోరటం తప్పని నా అభిప్రాయం కాదు. నేనూ సంస్కరణలు కోరే వాణ్ణే. కాని ఉన్న లోపాలను అర్థం చేసుకోలేనివాడు వాటినిగురించి యేప్రబోధం చేసినా చిన్నతనపుపనిగా ఉంటుంది. జీవితాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకోలేనివాడు కలం పట్టకూడ దని కూడా నా తాత్పర్యం కాదు. జీవితంలో ఉన్న తిరుగుళ్లు ఎవరికో గాని అర్థం కావు. అటువంటి సమయంలో రచయిత తను అర్థంచేసుకోగలిగిన కొద్ది జీవితాన్నిగురించే విమర్శించవచ్చును. జీవితాన్ని గురించి ఊహించటం ప్రారంభించే కన్న తన అనుభవంలోకి వచ్చిన విషయాలే ఉన్నవి ఉన్నట్టు రాస్తే లోకానికి ఎక్కువలాభం ఉంది. ఆ తరవాత ఏ రచనవల్ల ఎంతప్రయోజనం ఉందో, దానికి ఏ స్థానం ఇవ్వాలో లోకమే నిర్ణయిస్తుంది.

ఏ ఉపదేశం చేసేటప్పుడు కూడా రచయితకు బాధ్యత లేదు—తన ఉపదేశానుసారం నడుచుకుంటే లోకం ఏ మవుతుందో అతనికి పట్టదు. ఈ స్వేచ్ఛను ఏ రచయితా దుర్వినియోగ పరచరాదు.

వేదశాస్త్రాలూ, స్మృతి పురాణాలూ పూర్వం మనకు కల్పించిన సంప్రదాయంలో సాహిత్యం సృజిస్తే ఏం జరుగుతుంది? మనకు నాలుగు వర్ణాలు లేవు—నలభై వర్ణాలున్నై. మనలో క్షత్రియులూ, పూర్వక్షత్రియధర్మాన్ని అనుసరించి పాలించే రాజులూ లేరు. మనకు ఆశ్రమాలూ లేవు. బ్రాహ్మణధర్మం లేదు. లేవు కనకనే తెచ్చిపెట్టుకోవా లని అనవచ్చును: అది అసంభవం. ఆ మాట అయిదు నిమిషాలలో అర్థం చేసుకోలేనివాడు కాగితముమీద కలం పెట్టటానికి అర్హుడుకాడు. మనని పాలిస్తున్న ఆర్థికచట్టాన్ని, మన కుర్రవాళ్లు లా కాలేజీలలో చదివే న్యాయచట్టాన్నీ, మనకు కొత్తశాసనం ఇస్తున్న ఎసంబ్లీలనూ, మనని అనుదినమూ బాధిస్తున్న అంతులేని సమస్యలనూ ఎవరు తెచ్చిపెట్టారు? ఇవి ఎట్లా పరిష్కార మవుతై? ఇందులో మనప్రయత్నం వల్లగాని ఉత్తకోరిక వల్లగాని సాధించదగినది ఎంత ఉంది?

ఒకవర్ణస్థుడుగానూ, ఒకమతస్థుడుగానూ, ఒక దేశస్థుడుగానూ ఈకాలంలో మానవుడు జీవించలేకుండా ఉన్నాడు. మనజీవితానికి సరిహద్దులు లేకుండా పోతున్నై. ఒకప్పుడు శూద్రులు మాత్రమే చేసిన సేవ ఇవాళ అన్నికులాలవారూ చేస్తున్నారు.

వాణిజ్యం ఇవాళ వైశ్యులదిమాత్రమే కాదు. మనల్ని పరిపాలించటానికి ఎలెక్షనుల లోకి మనక్షత్రియులను పరిపంపించడం లేదు. మనజ్ఞానాన్ని అభివృద్ధిచేస్తున్న ఐన్‌స్టైన్, డార్విన్, హక్సిలి, బోస్, రే, రామన్ మొదలైన శాస్త్రశోధకులూ, షా, వెల్స్, టాగూర్, టాల్‌స్టాయ్, లూయిాస్ మొదలైన రచయితలూ బ్రాహ్మణులే నని చెప్పటానికి లేదు!

పూర్వపు ధర్మాలేవీ పనికిరావటం లేదు. మనువు చెప్పినట్టు శూద్రులకు నూటికి పన్నెండూ, వైశ్యులకు ఇరవైనాలుగూ, క్షత్రియులకు ముప్ఫైఆరూ, బ్రాహ్మణులకు నలభైఎనిమిదీ చొప్పున వడ్డీ ఇవ్వటం తలవరాని విషయం. ఇప్పటి ప్రభుత్వాల కర్తవ్యాలలో విదేశాలమీద దండెత్తటం ఒకటి కాదు. హాల్డేన్ చెప్పినట్టు దినదినమూ అభివృద్ధి అవుతున్న శాస్త్రజ్ఞానం ప్రపంచంలో ఉన్నప్రతివ్యక్తి జీవితాన్ని ఒకేవిధంగా మార్చటమేకాక ప్రతివ్యక్తికీ ఇతరవ్యక్తులతో ఎంచరాని సంబంధ ఏర్పాటుచేస్తున్నది. అంతర్జాతీయవాణిజ్యం దేశసంపదల నన్నింటినీ ప్రపంచ సంపద చేస్తున్నది. ఈకారణాలవల్ల విజాతీయత అనేది మనమనుష్యులలో ఉండి మనను వేధించుతున్నా, జీవితంలో అదృశ్య మవుతున్నది. ప్రతిదేశమూ తన నాగరికతకు ప్రతి ఇతర దేశంమీదా ఆధారపడ వలిసినప్పుడు ఏదేశంవాడు ఇతర దేశంమీదికి యుద్ధానికి వచ్చినా కృతఘ్నుడూ, భాతృద్రోహీ అవుతున్నాడు. ప్రతికులంవాడూ తన సౌఖ్యంకోసం తన అభివృద్ధికోసం ఇతరకులాలమీద ఆధారపడుతూకూడా కుల వైషమ్యాలను పెంచటానికి ప్రయత్నంచేసి ఆత్మద్రోహం చేసుకుంటున్నాడు. ఎవరి సరిహద్దులలో వా రుండి ఎవరి నాగరికతను వారు అభివృద్ధిచేసుకుంటూ, తమ పొలిమేర అవతల ఏమి జరుగుతున్నదో తెలుసుకోలేకుండా జీవించినంతకాలమూ లేని కొత్తధర్మం ఈనాడు మనకు అవసర మవుతున్నది. ఈనాటిసాహిత్యం మనలో కలిగించే జిజ్ఞాస ఈమార్పును అర్థంచేసుకునేటట్టు చెయ్యగలగాలి. లేకపోతే కావ్యంవల్ల లోకసంగ్రహం జరగటానికి బదులు, దాన్ని వినోదార్థం చదవటమో దేవతార్చనలో పెట్టి పూజించటమో జరుగుతుంది.

కోర్టుకు త్వరగా వెళ్ళటానికి త్వరగా తద్దినం పెట్టేపీడర్ల విజ్ఞానాన్నీ, మహావైభవంగా శ్రీరామ కల్యాణం చేసి ఏనుగఅంబారిలో ఎక్కటం దగ్గిర తగాదా పడేభక్తుల విజ్ఞానాన్నీ, ప్లీడరుగుమాస్తాపని చేసి వడ్డీవ్యాపారం చేసి మంచి మంచి ఆస్తులు సంపాదించి ఆర్యధర్మాన్ని స్థాపించటానికి చేసేసభలలో అగ్రాసనాధిపత్యం వహించే సనాతనుల సంస్కారాన్నీ, తమ పాండిత్యం వెల్లడిచేసుకోవటానికి ఎవరికీ అర్థం కాకుండా

పద్యాలు రాయటమే కాక రాసేది రాసేదే నని మకురుతనంచేసే కవుల సంస్కారాన్ని సాహిత్యం ఎందుకు పరిష్కరించకూడదూ? ఆచరణకూ ఆశయాలకూ మాటకూ చేతకూ చదువుకూ ప్రవర్తనకూ ఏమీ సంబంధం లేకుండా జీవించే మనము ఉండే ద్వంద్వాన్ని నిర్మూలించటానికి సాహిత్యం ఉపకరించదా?

వ్యక్తుల జీవితాలలో కలుగుతున్న ఆ మార్పే మన జ్ఞానానికికూడా కలుగుతున్నది. జ్ఞానమంతా ఒకటేనని చెప్పటందు కింకా అవకాశం లేకపోయినప్పటికీ వివిధ మార్గాల అభివృద్ధి అవుతున్న జ్ఞానాలకు పరస్పర సంబంధం ఏర్పడుతున్నది. న్యాయశాస్త్రమూ, ధర్మశాస్త్రమూ, వస్తువిజ్ఞానశాస్త్రమూ, రసాయనశాస్త్రమూ, వైద్యశాస్త్రమూ, మొదలైన అసంఖ్యాకములైన శాస్త్రాలు వెనక ఎన్నడైనా పారస్పర్యం ఎరగకుండా ఉండినవేమో గాని ఈనాడు అట్లా జరగటం అసంభవం. ఈ శాస్త్రాలకు క్రమంగా ప్రత్యేకత లేకుండా పోతున్నది. ఒక శాస్త్రాన్ని ధిక్కరించి మరొక శాస్త్రం అభివృద్ధి కాలేదు. ఈ వివిధశాస్త్రాల జ్ఞానం మానవుడికి అందుబాటులో లేక అతను తెలిసిన అజ్ఞానం అమితంగా ప్రకటిస్తున్నాడు. అతని మతాన్నీ విశ్వాసాలనూ ఈ జ్ఞానం అవసరమైనంతగా సంస్కరించటం లేదు.

జ్ఞానాన్వేషణ చేస్తున్నా మనిపించుకుంటూ తెలిసిన అజ్ఞానాన్ని ప్రకటించుతున్న వారిలో అగ్రేసరుడు సాహిత్యరచయిత. ఫిజిక్సులో కృషిచేసేవాడు కెమిస్ట్రీ, లెక్కలూ మొదలైనవి నేర్చుకోవా లనే సంగతి తెలుసుకుని ఉంటాడు. బయోలజీలో కృషిచేసే వాడికి ఫిజిక్సు, బాటనీ, కెమిస్ట్రీలు కొంతవరకైనా తెలిసి ఉంటై. కాని జీవితాన్ని విమర్శించే కవికి ఆర్థికశాస్త్రమూ, సోషియాలజీ, సైకాలజీ మొదలైన విస్తీర్ణ శాస్త్రాల తాలూకు జ్ఞానం కొంత కొంత అయినా ఉండక తప్పదు. భాషతో సంబంధించిన విషయం కనక మరొకవంక అతనికి భాషకూ, వ్యాకరణానికీ సంబంధించిన జ్ఞానంకూడా ఉండాలి. కళతో సంబంధించిన విషయం కనక కవి కళాభిజ్ఞుడు కూడా అయి ఉండాలి.

ఏ ఉపదేశంచేసే ఆశయంతో, రచన చేసే ఆశయంతో రచన చేసినా, ఇటువంటి విస్తీర్ణ జ్ఞానం లేకుండా రచయిత ఎట్లా ఉపదేశం చెయ్యగలుగుతాడు? కాకపోతే పూర్వులు చేసి ఉండిన ఉపదేశాలనే మళ్లీ తను చెయ్యాలి. ఏవైనా కొత్తసమస్యలూ, వాటిని పరిష్కరించుకునే కొత్తసూత్రాలూ ఉండకపోతే స్వతంత్రరచనకు అవకాశం ఎక్కడ? ఈనాటి జీవితంలో కలిగే సమస్యలను గురించి రాయటానికి ఈనాటి జీవి

తాన్ని "ఇన్‌ఫ్లూయన్సు" చేస్తున్న రాజకీయాలను గురించీ, ఆర్థికస్థితిని గురించీ ప్రపంచనాగరికతను గురించీ ఏమాత్రమైనా తెలిసిఉండాలి.

మనను వేధించుతున్న సమస్యలలో నూటికి తొంభైతొమ్మిదిపాళ్లు ఆర్థికదుస్థితి వల్ల కలిగేవే నని నూటికి తొంభైతొమ్మిదిమంది రచయితలకు తెలియదు. అందువల్ల ఇప్పటి సాహిత్యం నిండపా లవుతున్నది. అమాయకులూ, అసమర్థులూ అయిన మగవాళ్ళూ, భాగ్యవంతులూ, మూఢులూను. ఈ నాడు మన జీవితాన్ని బాగు చెయ్యటానికిగాని పాడుచెయ్యటానికిగాని వ్యక్తులు చాలరు. (హిట్లరు ముస్సోలినీలుకూడా ఈసూత్రాన్ని తల్లకిందు చెయ్యలేరు.) ఒకప్పుడు రాజులమీదా మతాధిపతులమీదా అపారమైన బాధ్యత ఉండే దేమో కాని ఈ నాడు మనకు ప్రాప్తించే దౌర్భాగ్యానికి కారణభూతా లైనవి అజ్ఞానమూ, అసంస్కారమూను. సాహిత్యంగాని మరొకటిగాని సంస్కరించాలిసింది వాటినే.

నా కిక్కడ ఉన్నకొద్ది అవకాశంలో పైన చెప్పిన సత్యాన్ని నిరూపించటం సాధ్యం కాదు. కాని ఎవరిమట్టుకు వారు ఆలోచించేటందుకు కొన్ని సూచనలు చేస్తాను. అనేక బాధలకు కారణభూత మైన డబ్బును తీసుకుందాం. ఒకప్పుడు డబ్బూ దానితో కొనదగిన సంపదా ఒక క్షత్రియుల స్వాధీనంలోనే ఉండేది. దేశసౌభాగ్యం వారి మీద ఆధారపడి ఉండటంవల్ల దారిద్ర్యం కలిగినప్పుడు వారు దానికి బాధ్యులై ఉండే వారు. వారు తమ శక్తిని దుర్వినియోగ పరచకుండా ఉద్బోధించటం సాహిత్యానికి సాధ్య మయి ఉండేది.

ఈ నాడు మనకు కావలిసిన సంపదలు చైనాలో, జపానులో, ఇంగ్లండులో, అమెరికాలో, జర్మనీలో, ఫ్రాన్సులో, స్పెయినులో, ఇటలీలో, నార్వేలో, స్వీడనులో - ప్రపంచ మంతటా ఉన్నవి. మన దారిద్ర్యానికి ఎవరిది జవాబుదారీ ? భాగ్యవంతు లంటాం ! భాగ్యవంతు లెవ రని ? వీధిలో బిచ్చ మెత్తుకునే వాడి దగ్గిరనించి "మల్టీమిలియనీరు" వరకూ అన్ని తెగలవారూ ఉన్నారు. ఈ దారిద్ర్యం కొందరు భాగ్యవంతుల మూలకంగా రాలేదు. ప్రపంచంలో ఉన్న డబ్బంతా అందరికీ సమంగా పంచేస్తే ప్రపంచ సంపద అభివృద్ధి అవుతుం దనే నమ్మకంలేదు. ఈ దారిద్ర్యానికి కారణం స్వార్థపరత—ఎవడి జీవితం వాడే జీవించగల డనే అపోహ—సంపదను స్వంతం చేసుకుందా మనే ప్రయత్నం. ప్రపంచం నిండా నిరుద్యోగు లున్నారు. సృష్టి నిండా వస్తుసముదాయం ఉంది. ఆ వస్తుసముదాయాన్ని ఈ నిరుద్యోగులు సంప

దగా మార్చటానికి మావవుడి స్వార్థబుద్ధి అడ్డం వస్తున్నది. లోకంలో ఉన్న వస్తు సముదాయాన్నంతా కొందరు వ్యక్తులు స్వంతం చేసుకుని కూర్చున్నారు. దాన్ని సంపదగా మార్చటంవల్ల లాభం ఉంటేనే మనకు సంపద సంప్రాప్త మవుతుంది. లేకపోతే లేదు. ప్రపంచంలో ఉన్నవా రందరికి సరిపడ్డధాన్యం లే దని స్పష్ట మవుతున్న ది- లేకపోతే కొందరు తిండికి మాడుతున్న వా రుండరు. ధాన్య మంటూ ఉంటే దాన్ని ఊరికేనైనా ఇచ్చి వెయ్యవలసిందే గాని వృధాచేసిన ప్రయోజనం లేదు. ఈ పరిస్థితులలో ఏ భూస్వామిఅయినా సరే ధాన్యంమీద వచ్చేలాభంకంటె పొగాకు మీద నమ్మకంగా ఎక్కువలాభం వచ్చే టట్టయితే భూమిలో ధాన్యం నాటటానికి బదులు పొగాకు నాటేస్తాడు! ధాన్యంమాదిరిగా శీఘ్రకాలంలో ఖర్చు అయ్యే సంపద విషయంలోనే కాక బహుకాలం వాడదగిన సంపద ఉన్నచోట కూడా స్వార్థబుద్ధి దారిద్ర్యహేతు వవుతున్న ది. నాదగ్గిర ఒక మోటారు ఉంటుంది. దాన్ని నేను రోజుకు రెండుగంటలు మాత్రమే ఉపయోగిస్తాను. మిగతా ఇరవైరెండుగంటలూ "గరాజు" లో పెట్టి తాళం వేస్తాను కాని మరొకడికి ఇవ్వను! ఆమోటారు కారును నాబోటి వాళ్ళుఇంకా పదకొండుగురు వాడటానికి సావకాశం ఉంది. ఒకవంక పరిశ్రమలు పని చెయ్యవలసినంత జోరుగా పని చెయ్యటం లేదు; మరొకవంక అపరిశ్రమల ఫలితాన్ని పొందలేక జనం మాడుతున్నారు. ఎక్కడైనా ఒక మిల్లుగాని ఫ్యాక్టరీగాని స్వార్థ కారణంగా మూయటం తటస్థించినప్పుడు అందులో పనిచేసేవాళ్ళు దిక్కులేనివా ళ్ళవుతున్నారు.

ఇదంతా స్వార్థబుద్ధివల్ల కలిగిన దారిద్ర్యం. కాని స్వార్థబుద్ధి భాగ్యవంతులను మాత్రమే ఆశ్రయించి ఉండ లేదు. పరమదరిద్రుడూ స్వార్థంలోనే జీవిస్తున్నాడు. ప్రపంచసంపదను అభివృద్ధిచేసే ప్రయత్నములో ఎవడూ పని చెయ్యడం లేదు. గంజాయీ, నల్లమందూ, సారా మొదలైనవి ప్రపంచసంపదను ఎంతవరకు అభివృద్ధి చేస్తున్నవో నిర్ణయించటం కష్టం. ఇంతకంటెకూడా హేయము లైన వస్తువులు ప్రపంచములో తయా రవుతూనే ఉన్నై. కాని పొలాలు పండించేవాళ్లు ఏఉద్దేశంతో పనిచేస్తున్నారో ఈహేయవస్తువులను తయారుచేసేవాళ్లుకూడా అఉద్దేశంతోనే చేస్తున్నారు - నాలుగుడబ్బులకోసం.

ప్రపంచములో ఇటువంటిస్వార్థబుద్ధిని నిర్మూలం చెయ్యటం వల్ల ఏమి లాభం కలుగుతుందో ఆలోచించి తెలుసుకోవచ్చును. ఇప్పుడు మారణయంత్రాలు తయారు చెయ్యటానికీ, భాగ్యవంతులను సంరక్షించటానికీ దేశాలను సంరక్షించటానికీ మీదు

కట్టి ఉన్న అనేక కోట్లసైనికులూ, పోలీసులూ, పనివాళ్లూ విడుదల అవుతారు. వీ రంతా ప్రపంచసంపదను అభివృద్ధి చెయ్యటానికి పూనుకుంటే అందరికీ గుడ్డ ఉంది. అందరికి ఇళ్లున్నై, నాగరికతను అనుభవించే సదుపాయం అందరికీ ఉంది. వస్తువులను స్వంతం చేసుకోవలిసినదుర్గతీ, వాటికి కాపలా కాయవలసినదుర్గతీ ఎవరికీలేదు. ప్రపంచ సంపదను వృద్ధి చెయ్యడంలో చెయ్యి చేసుకోవటానికి ఎవరికీ అభ్యంతరం లేదు. దొంగ తనాలు చెయ్యవలసిన అవశ్యకత ఎవరికీ లేదు. యంత్రాలు స్వేచ్ఛగా అభివృద్ధి కావటానికి ఏఅభ్యంతరమూ ఉండదు. మరీ కష్టసాధ్య మైనపను లన్నీ యంత్రాల చేతనే చేయించుకోవచ్చును. ఈపరిస్థితులలో ఇప్పటి కోటీశ్వరుడికంటె కూడా రెండింతలు సుఖం ప్రతిమానవుడూ అనుభవించవచ్చును. లోకాన్ని స్వర్గం చెయ్యవచ్చును. ఈస్వర్గానికీ మనదరిద్రానికి అడ్డంగా ఉన్నది స్వార్థబుద్ధి, అసూయ, అసంస్కారం. వీటిని నిర్మూలించదగినది సాహిత్యం ఈనాడు ప్రపంచంలో కొద్దిమంది ధనికులు మాత్రమే ఉండి, మిగిలినవారు దరిద్రులుగా ఉంటూ, ధనికులు తమసంపదను యథేచ్ఛగా అనుభవించ గలగటమూ, దరిద్రుల దారిద్ర్యం ధనికులను అంటకుండా ఉండటమూ అసంభవం. దారిద్ర్యం పండి బద్ద లయినప్పుడు విప్లవాలూ, అంటువ్యాధులూ బయలుదేరి దరిద్రులనూ భాగ్యవంతులనూకూడా ధ్వంసం చేస్తున్నై. అసంస్కారం పండి బద్ద లయినప్పుడు యుద్ధాలు సంప్రాప్తమై ఉన్నవా డనీ లేనివా డనీ విచక్షణ లేకుండా అందరినీ నాశనం చేస్తున్నై.

వ్యక్తులు భాగ్యం అనుభవించ గలగటమూ దారిద్ర్యాన్ని జయించటమూ ఈనాడు ఎంత అసాధ్యమో, వ్యక్తులు కామ, క్రోధ, లోభ, మోహాదులను జయించటంకూడా అంతే సాధ్యం. సామ్యవాదంలో సరికుదిరిన ధనికుడు ఉత్సాహంకొద్దీ తనడబ్బు బీదలకు పంచి ఏం చేస్తాడు? దరిద్రులసంఖ్యలో తనుకూడా కలుస్తాడు! ఈప్రపంచంలో ఒక వ్యక్తి స్వార్థబుద్ధిని జయించి ఏ మవుతాడు? తక్షణం అడు గంటుతాడు! అందుచేత ఈనాడు మనప్రపంచంలో ఆధ్యాత్మికచింతనకుకూడా ఆస్కారంలేదు. ప్రతిక్షణమూ పరానికి ఇహం అడ్డం వస్తూ ఉంటుంది.

మన జీవితాన్ని అనుక్షణమూ "యిన్ఫ్లూయన్స్" చేస్తున్న ఆర్థికాది చట్టాలను గురించి మన ఇప్పటిరచయితలు రాస్తున్న అర్థంలేనిరాతలు చాలా ఉన్నై. వ్యక్తులను గురించి వారి పరస్పర సంబంధాలను గురించీ రాసినప్పుడే మనవాళ్ళు సత్యమైన కల్పన చెయ్యలేకుండా ఉన్నారు. సంఘంమీద అభిప్రాయాలు ప్రకటించే టప్పుడు మన రచయితలు మరింత పొరపాటుగా రాయటానికి అవకాశం ఉంటున్నది. ఒకఊరి

వా రంతా బీదలు కావటంచేత వారు ఒకానొక దేవతకు గుడి ఒకటి కట్టించలేకపోయి నట్టు మనవారొకరు కథ చెబుతున్నారు!

సాహిత్యంలో "పేట్రియాటిజం" బొత్తిగా కుదరదు. మనకోసం మనం సాహిత్యం సృజించుకునే రోజులుకూడా పోతున్నై. భాషలు ఏర్పాటు చేసినహద్దులూ, ప్రభుత్వాలు ఏర్పరచిన సరిహద్దులూ దాటిపోతున్నది సాహిత్యం. కొద్దికాలంలో ప్రపంచ సాహిత్యం జాస్తికాబోతున్నది. మనమింకా మనపూర్వులను శ్లాఘించటానికీ, మన కులాలను సమర్థించుకోటానికీ, మనమతాన్ని ప్రచారం చెయ్యటానికీ, మనదేశభక్తి ప్రకటించటానికీ రచన చెయ్యటం మానుకోవాలి.

సాహిత్యం జీవితాన్ని విమర్శించగలదు, గనుక అది జీవితం కంటె ఒకమెట్టు పైగానే ఉంటుంది. నిత్యజీవితంలో మనకు ఆంధ్రరాష్ట్రంకోసం పోరాడటమూ, భారతస్వాతంత్ర్యంకోసం అలజడి చెయ్యటమూ తప్పదు. అరవలు తమ స్వార్థాన్ని త్యజించేవరకూ, ఆంగ్లేయులు తమ స్వార్థాన్ని త్యజించేవరకూ కాని మనసాహిత్యానికి కూడా ఆపాళ్లే పట్ట నవసరం లేదు. ప్రపంచాన్నంతా ఒకటి చెయ్యటానికి ఇంకేదీ ఉపకరించకపోతే కనీసం సాహిత్యమైనా ఉపకరిస్తుంది. మనమీద పడి తిన చూస్తున్న అరవలనూ, ఆంగ్లేయులనూ ఇంకొక విధంగా కాకపోతే మనసాహిత్యంద్వారానైనా సంస్కరించ గలుగుతామేమో!

## భిక్షువు

వేడి నిట్టూర్పు గాడ్పుల వేగి వేగి
హృదయపాత్రిక గేల గీలించి ప్రేమ
భిక్షకోసమె ఆసించి వేచియున్న
వాడు నీనవయౌవనప్రాంగణమున.

తరుణి, యీయాచకుడు నీసుధామధుర వి
లోకనంపుశీతలవృష్టి సోకకున్న
విరహబాధాక్షుధానలాభీలకీలి
మాలికల గాలి నుసి యయి వాలుసుమ్ము!



## ఆమె

ఆమె ప్రాభాతకలధౌతకౌముదీ వి
మలవిలాసమ్ము; ఆమె శ్యామలనభో వి
లంబమానవినీలకాదంబినీ ప
థాల తోచు సౌదామినీతరళలతిక;

ఆమె వాసంతదివసాంత హేమరత్న
రాగరంజిత మంజువిరాలవేళ,
మలయమందానిలోర్మికా మాలికల ను
యాల లూగు కోయిలకన్నె యేలపాట;

ఆమె నవనవోన్మేషరమ్యాతిరమ్య
కోమలస్ఫారతారకాకోరకమ్ము;
ఆమె శీతలసాంద్రచంద్రాతపాంత
కార్తికనిశీథినీసుధాకమ్రమూర్తి;

ఆమె శ్రావణమాససంధ్యాభ్రవీథి
దోచు శక్రచాపశబలరోచి; ఆమె
కామినీకాముకుల తొలిప్రేమచుంబ
నమ్ము; ఆమె లోకైకసౌందర్యలహరి;

ఆమె ప్రథమసమాగమశ్రీమనోజ్ఞ
వేళ, నూత్నవధ్వోష్ఠప్రవాళపాళి
నలరు లలితలజ్జాదరహాస రేఖ;
ఆమె హేమంతమధురసంధ్యాకుమారి;

ఆమె మామకజీవితధామమునకు
దివ్యకాంతులకమనీయదీపకళిక;
ఆమె యస్మదీయాచ్ఛసౌహార్దహృదయ
వల్లకీస్వనమ్ముల మ్రోగు ప్రణయగీతి;

ఆమె సుందరనందనారామసీమ
దాటి, తారకారాజన్యకోటి గడచి,
నీలజలదాల జారి నామ్రోల బడిన
పారిజాతమనోహరప్రసవమాల;

ఆమె నాచెంత లేకున్నచో ముహూర్త
కాల మొక్కయుగమ్ముగా గడచు నాకు;
మామకామలప్రేమసామ్రాజ్యహృదయ
రత్నసింహాసనాసీనరాజ్ఞి యామె!

## శిల్పి

లోకమోహనకాంతావిలోకనములు
హరితశాద్వలంపు తివాసియందు హాయి
గా యథేచ్ఛావిహారమ్ము సేయుచున్న
గువ్వజంటపైన నిలిపి కుటిలగతుల

మృదులమలయసమీరణోర్మికలు మసలి,
స్నిగ్ధసుమమాలికమ్మున జెదరియున్న
నీదు చికురంపునొక్కుల నీలికురుల
నల్లనల్లన గదలించి యాటలాడ,

నాడు ప్రియతమా, వాతాయనమ్ము చెంత,
నీలకౌశేయమును దాల్చి నిలిచినావు,
శ్రావణశ్యామలాంబుదసంచయమ్ము
సంగమమ్మున బొడము నుషస్సువోలె!

నీమనోహరసవిలాస కోమలాస్య
మస్మదీయహృదయఫలకాంతరమున
నాపుకొనలేని భావనాలేపనముల
ప్రేమతూలికచేత జిత్రించుకొంటి!

**దామెర రాజగోపాలరావు**

# తిరణాల

## విజయ వినాయక కృపాకరం

తండ్రి

పోతావా యెంకట లచ్చీ
పొద్దుపొయ్యేదాక రావా!
పొద్దు పోయా మద్దూ మణిగా
సుద్దుపాటలు ఇందువు రాయే!

కొడుకు

అయ్యోవ్ ఆక లవుతుందే!
అమ్మేది రయ్యోవ్! ఆక లవుతుందే!
ముందే పోయిందా అయ్యా, మాయమ్మ!
మన్నిడిసి మనయింటి కెల్లిందా మాయమ్మ!

తండ్రి

నీకు నాకూ దూరమాయా!
కోటప్పకొండ లడ్డమాయా!
కోటయ్యదేముడి తిరునాలాయా!
కొడుకుకళ్ళ్యా కాలవ లాయా!

కొడుకు

అయ్యోవ్, ఆక లవుతుందే!

తండ్రి

యేడేండ్ల కొడుకే, యేడుత్తుండాడే!
యీడ ఆడా కెందు కీడకే రాయే!
కొడుకూ తండ్రికన్న కానోళ్ళు గొప్పా?

ప్రజ

నాయముగా నిన్నాదరించరు రారా!
పొద్దుపోయెనాగులుమాకు సుద్దులేలరారా!

తండ్రి

అబ్బీ, సిక్కంగా పోయరో ముంతలో,
ఆకలి ఆరాటా లణిగి పోవాల్రో!
కైపుతో కైలాసం తొంగి సూడాల్రో!
కైలాసంముంతతో రండర్రో
కతలు సెపుతాను!

ప్రజ

రావోయి రావోయి నాగులు మయ్యా
బొందితో కైలాసం తొంగి సూద్దాం!

తండ్రి

యిశారం పడుతుందే యెర్రిపిల్లడా!
తొందరగ పోతుందని సైత్రమాసాన్ని
యిడిసిపొయ్యే యెర్రికుర్రాడా!
ప్రామెలుగానీ యీశారంగానీ
సూపించటానికి సిగ్గడే పిల్లడా!
సూడరా యీశోద్దెపు కష్టం!
నిద్రోటమైనా సౌఖ్యం గాదురా!
నిద్దర్లోనైనా నల్లసీకటేరా!

ప్రజ

పోదామా సావాసంగా
నిద్రలేనీ బద్రలేనీ లంకకేసీ!
యెనకదినాల యెన్నెలలోనే
మనసు మాగిన మట్టిలోనే

మాయమాట మరుగులోనే
యిందరిబోగా లున్నాయి పిల్లో!
పోదామా............
ముద్దూ సుద్దూ పాడేరోజున

అద్దు దాటీ పోసిరోజున
యెన్నెల గిన్నెలో యేశాని పిల్లో
యెంకన్నసామికి యెండిముడుపులు!
పోదామా......

ప్రిజ

వై రాజ్జ గుమ్మడియలో
ముద్దు లేదు ముడుపు లేదు
సుద్దు సిలక పాడయే!
వై రాజ్జ......

తండ్రి

యెన్నెల గిన్నెలో యెంగిలి తిన్న
యెర్రిమూతి యేడిమీద
మంచు పారినా కంచు పారినా
యెంగిలియేడి యెండ లుండునే
పోదామా......

కొడుకు

అయ్యోవ్, ఆక లవుతుందే!
అ మ్మేది రయ్యోవ్ ఆకలవుతుందే!

తండ్రి

దూరా నుందిరోవ్ దేముడి లంక!
దేవ తుంది రోవ్ లంక దీపంలో!
గందమాని గాలిలంక రా!
పొన్నమాని పాట లంకరా!

పోదామా ముద్దుల కొడుకా
పొన్నమాని పొలిమేరలంకకి!
ఆకు లాకులు సల్లం గుండయ్యోయి!
అడక్కుండానే దేము డుండాడోయి!

దేముడి దగ్గిరి సుట్టా లైనారోయి
దేముడి లంకలో దేవత లందరు!
పోదామా సావాసంగా
దేముడి లంక దిక్కుకేసి!

ప్రజ

ఏటికి ఒకరాజూ యెన్నెల
యాతా మెత్తాడూ యెన్నెల!
యాతా మెత్తి యేర్లో యేత్తే
అడివికి పోయిందీ యెన్నెల!

తండ్రి

కల్లో లంకగా కానొత్తుందిరా
మంచు ముసుగులో దూరా నుందిరా!
నీడ సంద్రంలో నీడనేలమీద
పున్నెం మడుసుల పురిటికల్లో లంకరా!
పోదామా......

యెన్నెల సంద్రంలో యెండీ బూముల్లో
యిసిత్రిం పూలల్లో యాల పాటల్లో
గందాల గందర్వ కలవపూలంకలో
పిల్ల మన సుందిరో!

ప్రిజ

పోదామా సావాసంగా
కలవపూల లంక కేసి!

తండ్రి

యెన్నెల యెలుతురు తెల్లారి పోగానె
పిల్లపాట పొంగి పోగానే,

యేకువ పాటా, యెన్నెల్ల ఆటా,
ఆట పాటలో కలిసి పోవురా !
పోదామా......

ఆరిపోయే ఆటపాటా
మాగిపోయే మరుగుమాటా
ఎరుపుకలవతో బంగారు మబ్బుతో
కలిసి మెలిసి తెల్లవారునాద్రి !

సీకటిపాటలో సిగిరించు రాకా
సిగిరించుపాటలో సుక్క లున్నైరా!
సుక్కల్లవనంలో గొల్లభా ముందిరా
భామకళ్ళలో మిణుగురు లున్నైరా!

ప్రజ

పోదామా సావాసంగా
గొల్లభామ గోటులంక కేసీ !

తండ్రి

సీడలు సీడలు సీరుగా పారే
కన్నీళ్ళమంచున కా నొచ్చి కానాద్రిక
సీడగా నిలిచినా సీటు గుండీ పిల్ల !
పొద్దెంగా సూసినా సక్క గుండీ పిల్ల !

శేతిర్లో రాయిగా మారినా చాలాద్రి
శేతిరి మనసుల రాయిగుండె లేనాద్రి !
సచ్చినసంబరాలు సుక్కన యింటిలో
మరుపులు రాని మాపటి యింట్లో
మిడిగుడ్లు యేసుకుని మూలుగుతుండాలోద్రి!

ప్రజ

పోదామా సావాసంగా
మాపటియిల్లు మూసియేసి !

తండ్రి

రండాద్రి రండాద్రి !
తలో ముంత తాటిపానకం
తాగి తందనాల తబ్బిబ్బు లౌదాం
పాత పాటల్లో పాతకత లన్నీ,
పాతర తవ్వి తూర్పార పోద్దాం !

కొడుకు

అయ్యోవ్ ఆక లవుతుందే.
అమ్మేది రయ్యోవ్, ఆక లవుతుందే !

తండ్రి

ముంతకల్లుతో మరిసి పోరా
కొడకో ! కలుర కొడకో !
తాగర కొడకో !
తాగి తాగి తాగి ఇప్పట్నుంచీ
తలపు లన్నీ అన్ని మరిసిపోరా !

పోతావా వెంకట లచ్చి !
నువ్వు పోతే ముం తుంది లేవేవ్ !

అందరూ

పోదామా సావాసంగా
కైపుతో కైలాసం !
చేదామా ముంత కల్లుతో
ఈశ్వరుడికి అబిశేకం !



# కావ్యప్రమేయము

జమ్ములమడక మాధవరామశర్మ

## = రసవర్ణదైవతాదికము =

వర్ణదైవతాదులు చెప్పడం అనుచితమని ఒకానొకరు అన్నారు. ఉచితమే అని సహృదయుల తలంపు. ధ్యానబిందూపనిషత్తులో జీవునికి హృదయాష్టదళపద్మ సంచారం ప్రతిపాదిస్తూ వేదమాత వర్ణతత్త్వం వ్యక్తం చేస్తున్నది. పూర్వదళం శ్వేతవర్ణం, ఆగ్నేయం రక్తం, దక్షిణం కృష్ణం, నైఋతం నీలం, పశ్చిమం స్ఫటికం, వాయవ్యం మాణిక్యం, ఉత్తరం పీతం, ఈశాన్యం వైడూర్యం. ఈవర్ణవ్యవస్థ ఉపనిషత్తు ప్రతిపాదించింది. ఆయాదళాలలో సంచారవిశేషంవల్ల జీవునికి ఆయారసమతి కలుగుతుం దని నిర్ణయం. కాబట్టి ఆయాదళాలలో వర్ణం ఆయారసాలకు ఉంటుంది అనడం ఉచితం. శ్రీచక్రంలో నవావరణ విధానం ఉన్నది. ఒక్కొక్క ఆవరణకు ఒక్కొక్కవర్ణం ఉండటం తాంత్రికసిద్ధం. ఆయా ఆవరణంలో ఆయారసవిభావన సాంప్రదాయికం.

| | | |
|---|---|---|
| మొదటి ఆవరణ | ముక్తామాణిక్యం | శృంగార |
| రెండవ ,, | చంద్రబింబ | వీర |
| మూడవ ,, | జపాకుసుమ | కరుణ |
| నాలుగో ,, | దాడిమీకుసుమ | భయానక |
| అయిదో ,, | సిందూర | బీభత్స |
| ఆరో ,, | జపాకుసుమ | రౌద్ర |
| ఏడో ,, | పద్మరాగ | హాస్య |
| ఎనిమిదో ,, | బంధూక | అద్భుత |
| తొమ్మిదో ,, | ఉద్యత్సూర్య | శాంత |

ఈవిధానాన్ని బట్టి వర్ణవిధి యుక్తం.

సత్త్వరజస్తమోగుణాలకు సిత, రక్త, నీలవర్ణా లున్న వనడం వైదాంతికాభిమతం. బ్రహ్మవిష్ణు మహేశ్వరుల తత్త్వాన్ని సూతసంహితాను సారంగా పరిశీలిస్తే గుణాల వర్ణ వివేకం స్పష్ట మవుతుంది. సత్త్వరజస్తమస్సుల పరస్పర సంబంధంవల్ల తొమ్మిది భేదాలు సిద్ధ మవుత వని విదితం. శాంతాది రసాలలో గుణసంబంధం ఒక అవస్థలో

అధ్యస్తమై భాసించక పోదు. ఆయావర్ణాల పరస్పరసంబంధవల్ల విజాతీయవర్ణాలు ఉత్పన్నం కావడం వస్తుశాస్త్రపరిశోధకులకు విదితం.

| రస | వర్ణ | దైవత |
|---|---|---|
| శృంగార | శ్యామ | విష్ణు (కామదేవ) |
| హాస్య | సిత | ప్రమథ |
| కరుణ | కపోత | యమ |
| రౌద్ర | రక్త | రుద్ర |
| వీర | గౌర | మహేంద్ర |
| భయానక | కృష్ణ | కాలదేవ |
| బీభత్స | నీల | మహాకాల |
| అద్భుత | పీత | బ్రహ్మ |
| శాంత | కుందేందు (స్వచ్ఛ) | నారాయణ (ప్ర)బుద్ధ |

వైదిక తాంత్రిక ప్రమాణానుగత వర్ణాలకూ, భరత ప్రతిపాదిత వర్ణాలకూ భేదం ఉన్నది. వస్తుతత్త్వపరిశీలనం చెయ్యగా ప్రకృత నిర్ణయానికి భేదము రావచ్చు; వచ్చినా హాని లేదు. ఆయారససిద్ధికోసం తత్తద్రసాధి దైవతాన్ని ఉపాసించవలెననడం సంప్రదాయరహస్యం. ఉపాస్యతా సిద్ధికోసం సాధకుడు ఉపాస్యానికి రూపకల్పన చేస్తాడు. రూపాధ్యాస చేసినప్పుడు గుణమయత, వర్ణనిర్ణయం, చేష్టాయుక్తత అపరిహార్యం అవుతవి. ఉపాసనవల్లనే సిద్ధి అవుతుంది. శ్రద్ధాళువై ఉపాసన చేసిన వ్యక్తి రససిద్ధు డవుతాడు.

వర్ణకల్పనకు ఇంకో విధమైన ఉపపత్తి ఉన్నది. రసాలను నాట్యానుగతం చెయ్యదలచిన నటుడు వాటిని అభినయించ వలసి ఉన్నది. ఆహార్యాభినయం అవసరమైనపుడు వర్ణనియతి లేకపోతే కుదురుపాటు లేదు. వర్ణము ముఖరాగానికి ఉపయోగిస్తుందని నిర్ణయము. పూజాదులలో ధ్యానానికి ముఖ్య వినియోగం ఉన్నదని నిశ్చితం. వర్ణదైవ తాత్మకత ఆగమసిద్ధం.

## = ఆ భా స =

యథార్థంగా లేకపోయినా ఉన్నట్లు భాసించడం ఆభాస. "ఆ, ఈషత్, భాసతే ఆభాసా" అపరిపూర్ణస్వభావంతో భాసించేది. ఈ ఆభాస, రస, భావాలకు సిద్ధం కావచ్చు. అందువల్ల రసాభాస, భావాభాసలను గణించాలి. భరతరసప్రకరణంలో ఇవి నిర్దిష్టం

కాలేదు. అయినా అందులో సూచనను బట్టి గ్రహించవచ్చు నని అభినవపద్ధతి. "శృంగారానుకృతి ర్యాతు స హాస్యస్తు ప్రకీర్తితః" అని భరతుడు. అనుకృతి అంటే అముఖ్య మని అర్థం; ఆభాస అని పరమార్థం. శృంగారానికి అముఖ్యత భాసించే టప్పుడు శృంగారాభాసం సిద్ధ మవుతుంది. అముఖ్యతా ప్రతిభానానంతరం హాస్యచర్వణ ఉండదు. అక్కడ హాస్యం పార్యంతికం. ఔత్తరకాలిక మైనహాస్యమే అటువంటి చోట్ల ఆస్వాదయోగ్యం. భరతుడు శృంగారాభాసం మాత్రమే సూచించినా, వీరా దుల ఆభాసరూపతనుకూడా ఉపలక్షణంగా స్వీకరించవచ్చు. హాస్యం అనౌచిత్య ప్రవృత్తికృతం. ఇటువంటి అనౌచిత్యం అన్నిరసాలలోనూ, విభావాదులలోనూ సంభా వితమే: కాబట్టి వీరాది ఆభాసస్థలాల్లోకూడా పార్యంతికంగా హాస్యం స్వాద్య మవుతుంది. సంవిత్తత్త్వ నిపుణు లయిన చిరంతను లంతా, రసభావా భాస వ్యవహారం చేశారు. హాస్యానికి కూడా ఆభాస ఉన్న దని అంగీకరించాలి. ఔత్తరకాలిక హాస్యం ఇక్కడ ఉండకపోదు. ఇక్కడి పార్యంతికహాస్యం ఉచితాను చిత విభావకం. నవరసాల ఆభాసస్థలాల్లో ఔత్తర కాలిక హాస్యమే ఆస్వాద్యం అయినా, ఆభాస అనే వ్యవహారం. ఈ విషయం వివాదస్థానం కాదు. సామాన్యంగా రసాభాసస్థలంలో రత్యాద్యాభాస ప్రతీతం అవుతుంది. అనంతరం చర్వణాభాస, తత్సారభూతంగా రసాభాస సిద్ధ మవుతవి. యథార్థానికి రసాభాస సిద్ధస్వభావం కాదు; రజ్జువుమీద సర్పాభాసవలె మిథ్య.

= భావశాంతి, ఉదయ, సంధి, శబలతలు =

ఆస్వాద్య మయినప్పుడు భావం అనేక ధర్మాలతో మిశ్రమై ఉంటుంది. విశిష్టం ఆస్వాద్యమాన మయినట్లు విశేషంకూడా సహృదయాస్వాద్యం అవుతుంది. భావం విశిష్టం; అందులో ధర్మాలు విశేషాలు. విశిష్టాన్ని విడిచి కేవల విశేషం ఆస్వాద్యం కాదు. అయినా విశిష్టకృత ఆస్వాదం వేరు, విశేషకృతం వేరు. ఈ ఆస్వాదవైజాత్యం చమత్కారవైజాత్యానికి హేతువు. భావానికి నాలుగవస్థలు. కేవలభావం స్థిత్యవచ్ఛిన్న భావం. భావానికి శామ్యదవస్థలో ఇంకోభావం అక్కడ ఉత్పన్నం కాకపోదు. అయినా అక్కడ భావశాంతి అనే నిర్ణయం. వ్యపదేశాలకు చమత్కార ముఖప్రేక్షితను అంగీకరించాలి. శామ్యదవస్థాకృత చమత్కారం ఆస్వాద్య మైనపుడు శాంతి అన వలె. భావోదయాదుల్లో కూడా ఇంతే. భావశాంత్యాదుల్లోకూడా భావం ఆస్వాద్యం కాకపోవడం లేదు, కాబట్టి భావం అని వ్యపదేశించడం న్యాయ మన్నాడు జగన్నా థుడు. తత్తదవస్థా వచ్ఛిన్నభావమే ప్రధాన మయినప్పటికీ, విశేషణాంశాన్ని అనుస

రించిన చమత్కారం అటువంటి స్థలాల్లో అనపలపనీయమే కావడంచేత భావశాం త్యాదులను వేరే పరిగణించటం ఉచితం. ఉదయ దవస్థాన కలిత భావమూ, శామ్య దవస్థా కలితభావమూ భిన్నా లని జగన్నాథుడుకూడా భేదం చెప్పక తప్పదు. ఆభేద బీజం విశేషణగతిని అనుసరించిందే. కేవల చిదంశమే రస మయినప్పటికీ, శృంగారాది నవభేదసిద్ధి కోసం విశేషణాంశం అనుసరించక తప్పదు. రసానికి శాంత్యాదులు లేవు. రసానికి శామ్యదవస్థ చమత్కారకం కాదు. ప్రాచీనాలంకారికుల పరిగణనములో ఇది చేరలేదు.

= ర సా భా వ ము =

కవి రసప్రతిపాదనలో వివక్ష లేనివా డయినా, రసం అత్యంతం అభావరూపంకాదు. కావ్యాంశాలు రసపర్యవసన్నము అయితేనేకాని చమత్కారం పుట్టదు. చమత్కార మనేది చిత్తధర్మ మన్నప్పటికి ప్రమాదం లేదు. చిత్తవృత్తి చేతనాశ్రితం. చేతన వర్ణన వల్లనే చమత్కారం ఉదయిస్తుంది. కవి అచేతన పదార్థాన్ని వర్ణించినా, అది చేతనాపరిణామం పొందుతుంది. నదీపర్వతాది అచేతన వస్తువులు ప్రధానము లయినా, అక్కడ నాయికా నాయక రూపచేతన ధర్మారోపం చేస్తేనే ఆస్వాద్యములు అవుతవి. స్థావర జంగమాత్మక మయిన నిఖిలప్రపంచమూ పర్యవసానంలో విభావరూప మయినా పొంది తీరవలె అనడం బాధకం కాదు.

= అ భి వ్యం గ్య త =

రసభావాదు లెన్నడూ వాచ్యాలు కావు; స్వప్నపథంలోనైనా కాగూడదట. రసాభి వ్యంజకా లయినవిభావాదులు వాచ్యకోటిలో ఉంటవి. విభావాది ప్రతీతి సమనంతర క్షణాన రసం ప్రతీతం అవుతుంది. ఇక్కడ ప్రతీతులలో క్రమం అత్యంతసూక్ష్మం. అందుచేత రసాదులు అసంలక్ష్యక్రమాలు. రత్యాది శబ్దాలచేత రసం వాచ్య మవు తుం దని ఉద్భటానుయాయులు. తర్వాతవారు అంగీకరించ లేదు. కేవల స్వపదోపా దనం అకించిత్కరం. స్వపదం ఉన్నా, లేకపోయినా, రసం ప్రతీత మవుతుంది. కేవల స్వపదంచేత ప్రతీత మయితే, శృంగారహాస్య కరుణాః అనే కారికవల్ల నవరస ప్రతీతి కలగాలి.

"స్వశబ్దై రభిధీయమానాః శ్రుతిపథ మవతరన్తః చేతనానాం చర్వణా చమత్కారం కుర్వన్తీ త్యనేన న్యాయేన ఘృతపూర ప్రభృతయః పదార్థాః స్వశబ్దై రభిధీయ

మానాః తదాస్వాదసంపదం సంపాదయన్తీ త్యేవం తదభిధాన మాత్రా దేవ త్రైలోక్యరాజ్యసంపత్సమృద్ధిః ప్రతిపాద్యతే - ఇతి వమ త్వేభ్యః!" అని కుంతకుడు ఉల్లంఘన చేస్తున్నాడు.

రసభావాదులు స్వశబ్దవాచ్యాలే అయితే దోష మని ఆలంకారిక వ్యవహారం. ఒకవేళ రసం వాచ్య మయితే, విభావాది పరిపుష్టం అయి, దోషంగా పరిణమించ దనీ, స్వశబ్దం అనువాదమాత్ర మనీ అభియుక్తులు భావిస్తారు. అలక్ష్యక్రమ మయినది ఒకప్పుడు సంలక్ష్యక్రమం కావచ్చు నని అంగీకరించారు. విభావాది ద్వారంగా రసం ప్రతీతం కావాలి. విభావాదికం స్పష్టంగా ఉండనిచోట అది ప్రకరణ పరిగ్రాహ్యం అయి, సమున్నేయం కావాలి. కాబట్టి ప్రకరణానుసంధానకృత మయిన విలంబం అక్కడ అవశ్యం భావి. అక్కడ క్రమం సులక్ష్యం.

## = రసవదాద్యలంకారత =

అన్ని వేళలా రసం అలంకార్యం కావలి. రసభావాదులు అలంకారా లని కొంతమంది ఆశయం. భూషణంవలె అలంకారం ఇతరానికి శోభాపాదకం; కాబట్టి అప్రధానం. దండిప్రభృతులు రసాదులను అలంకారాలుగానే భావించారు. వారి మతంలో అలంకారం ప్రధానం. రసం వల్ల సౌందర్యం ప్రతిపాదిత మవుతున్నది; కాబట్టి రసం ప్రధాన మయినా, అప్రధాన మయినా అలంకారమే. అలంకారం అప్రధాన మని ఆనందవర్ధనాదుల తాత్పర్యం. అందుచేత రసం పరాంగభావం పొందిన తావుల లోనే అలంకార మవుతున్నది. రసం మరోరసానికి గాని, భావానికి గాని అంగ మయినప్పటికీ చమత్కారమే. అది అప్రధానకృతమే కావడంవల్ల ఆవ్యపదేశం సిద్ధ మవుతుంది. రసం అలంకార్య మైనచోట్ల, స్వాతిరిక్త మేదీ అలంకృతం కాకపోవడం చేత రసవదలంకార మనడానికి వీలు లేదు. ఈవాదాన్ని తర్వాత ఆలంకారికులు అనుమోదించారు. రసవదాదులు అలంకారా లంటే అధమకావ్యత్వం సిద్ధ మవుతుంది! గుణీభూతవ్యంగ్యం అంటే ఉచిత మని మమ్మటాదుల ఆశయం. అలంకారాలు గుణీభూత వ్యంగ్యాలు కాగూడ దన్న నియమం లేదు. సమాసోక్తి మొదలైనవి గుణీభూతాలు కావు అనలేము. మమ్మటుని మీాది ఆదరం చేతకూడా అనలేము. రసం అలంకారం ఎప్పుడూ కా దని కుంతకుడు ప్రాచీనమతాలను ఖండించినాడు. స్వాభావిక మైన పదార్థ స్వరూపం అలంకరణం కా దని అతని నిర్ణయం. కాబట్టి స్వభావోక్తి అలంకారం కాదు.

రసాలకు అంగాంగిభావకల్పన అనుచితం. ఉపకార్యోపకారక భావం ఉంటే స్వచమత్కార విశ్రాంతి ఉండదు. అది లేకపోతే రసత్వం లేదు. స్వస్వ విభావాది సామగ్రీ పరిపుష్ట మైనరసం పరిపూర్ణమై, తక్కినవాటిని తిరోహితం చేస్తుంది. అఖండాస్వాద్య మైన రసం ప్రధానం అయ్యేసరికి, స్థాయిభావా లను కొనే వన్నీ వ్యభిచారు లవుతవి అని భరత నిర్ణయం. విశిష్టమైన ఏకవిధ ఆస్వాదంలో అంగాంగికల్పన పనికి రాదు. కుంతకుని పై అభిప్రాయం రసమహత్తను పోషిస్తుంది. రసం సర్వ ప్రధాన మని తర్వాత ఆలంకారికు లంతా సమ్మతించారు.

▽

## చెలీ!

'సంపత్'

నీవు సుధామయూఖ వని నీ కడకన్నుల వెన్నెలందె నా
జీవితకైరవమ్ము వికసింప, సుఖానుభవమ్ములోన నే
వా విధి హస్తముల్ మొగిచి వచ్చిన దాచిన నీ ప్రచండ కీ
లావృత తీక్ష్ణతా జ్వలదపాంగమునన్ వెరపింపకే చెలీ!

ఈనిరుపేదజీవి కొకటే తుదికోర్కె నశించిపోవు సం
ధ్యానిల వీచికా విగళితార్తసుమ మ్మిది. వాసనాపరి
త్రాణము గాగ నీకచభరమ్మున దాలిచికొమ్ము వేదనా
జ్ఞానసుషుప్త భారకలనా పరితప్తతమై లయింపగన్!

ఈసుమమాల నీవ ధరియింపను త్రెంపను యోగ్యురాలు! క
న్యాసుషమ ప్రసూన విమలాకృతి తోచెడు నీదృగంత రే
ఖాసమరాగ రోచు లమృతాలస తౌటకు దుర్విషచ్ఛటా
వాసిత జాగ్రదుగ్ర పరివర్తన వైఖరి పూన యోగ్యముల్!

అమృతము కాదు హాలహాల మైన సరే సహియించుకొందు నె
య్యము గలచోట - ప్రేమమయ మైన సతీతరళాంబక ప్రభా
విమల సుధాంశు జాలములు వెల్గినచోటు విషాదజీవితాం
తము గురితింపకే ప్రహసన భ్రమలో గికురింత వెట్టెదున్!

# అలంకారదేవి

## కూచిభొట్ల ప్రభాకర శాస్త్రి

ఎన్నడో భవదంతరంగేక్షణములు
సుప్రసన్నత వహియింప జూచినాను
నిష్ఫలత్వాన; రూపసన్నిహితరచిత
కావ్యబిందువు గొను మలంకారదేవి!

౧

అపర దిఙ్మండల పరాగ మధిగమించి
ననల ముత్తైదువులకు వాయనము పెట్టి
పేరటాండ్రను మోద మొప్పార పెదవి
విప్పి మంగళముల్ పాడ నొప్పె వనము.

పవనడోలిక లెక్కి పూబడుచు లెల్ల
రత్తరువు చిమ్మనూగుచున్నా రుప్రీతి.
కోకిలాంగన మధురంపుకూజితములు
చేయు చూగుచు నున్న దాచేరులంచె.

వాయుగమనంబు తోచె, నావారిదములు
కూడ విడిపోయె, నల్లనికొండమీద
కాంతి వెదజల్లుచుండి నక్షత్ర మొకటి
చేత మొప్పార దాగుడుమూత లాడె.

కారుమొయి లన్నమాటయే కాని, దారి
తెన్ను తెలియని యావేళ కన్నుగవకు
విందు గూర్చెడి శంపా పవిత్రకాంతి
వెలయ దే మందు నాడు తన్వీలలామ!

ఆ విశాలనేత్రద్వయ మావినమ్ర
యానము విశాల కరుణామహత్తు దెలుపు
గాని కాఠిన్య మేమియు గానరాదు;
గోముఖవ్యాఘ్రరీతియో యేమొ అకట!

అల శకుంతల నీయడ ఆమహర్షి
తాల్చి కాషాయ మాశ్రమస్థలమునందె,
పూల మొక్కల నవ్వించు నాలతాంగి
యానవైచిత్రి నేను కన్నార గాంతు.

ఆస్వరూపనిధాన లక్ష్యంబు సేతు,
అప్పు డీదేశ మేల, ఈయంతిపురము
నేల, ఈభోగ మేల, ఈకాల మేల!
బాల అరకాల దన్నదే వాని నెల్ల.

౨

నాడు దేదీప్యమాన దీపోడు తతుల
చంద్రబింబానుకారి విసారకాంతి
నక్షిపర్వంబ వైతి వాహా లతాంగి!
కన్నుదోయికి నది యలంకారమయ్యె!

నేను నీవలె నీకును నెమ్మి నాకు
వలెనె నాత్మ నన్యోన్యంపు వైపరీత్య
మైనరక్తిని జిక్కితి! మన్యలోక
మున్నదే మనకెటనైన నుత్పలాక్షి?

నీదురూపంపు సాటియా నాదుప్రేమ
నాదురూపంబు సాటియా నీదుప్రేమ
ఒకటి యొకదాని ప్రతిబింబ మోలతాంగి,
మన పరస్పరరాగంబు మలచియుంట.

౩

నాదు దంతపు దూవెన నవ్యకాంతి
జిమ్ముచున్నది యాసమయమ్ము మొదలు
ఏక ఘటికాసమయ మష్టలోకపాల
నం బొనర్చె వేణీ స్పర్శనంబు బొంది.

ఒక్క మొగి లోకపాలన మూడ్చిపుచ్చి
దూతికా సంవిధానంబు దొరకొనినది
పాలనముకంటె దౌత్యంబు పరమగుణము
నీకడను నీదు దీర్ఘ వేణికను దెచ్చె.

జాతహర్షంబుచేత సంకేతమిచ్చి
యుంటివిహృదయాంతరమున వాల్గంటిమిన్న!
ప్రణయవార్తలు పఠియించి ప్రణయదూత
యయ్యె, హృదయంబుచీల్చినీవరయదగును.

నేను దూవెన నేవేళనైన గాని
విడువగా నొల్ల; ఐన నవ్వేళనుండి
సన్నిహిత మిత్రమై నాదుసరస నిలిచి
తనరుచుండు విదూషకత్వము వహించి.

నాటనుండియు నీముఖనవ్యకాంతి
దలచుకొనుచుండ విరహవిస్తారబాధ
శుష్కతేజుడ నైతిని శూన్యమధ్య!
అద్ది దూవెన గని పరిహాస మాడు.

౪

నాటి శర్వరి భోజనవాటియందు
ప్రథమ దర్శన మయ్యె బింబంపుమోవి
మధురహాసంబు చేసి సంప్రాప్తలజ్జ
దలను వాలిచి వేరొకదారి బోతి.

భోజనంబున కరుదేర పూవుబోణి,
తామరస హస్తములను విస్తళ్ళువేయ
మధువు సంప్రాప్తమయ్యె నీ మధుకరునకు
ఛేకుడను గాను కన్నుగీచినను గాని.

మానుకానన చంద్రికా సోమసుధను
సారె సారె కపాంగవీక్షాచకోర
కములచేత గ్రోలించితి వమితముగను
హృదయవేద్యంబు గద నీయభీప్సితంబు!

అమల ధవళాంశుకోత్తరీయంబు ప్రబల
శంబరారి జయపతాక సామ్య మెసగె
హంసయానమ్ముతో నప్పు డరుగ నీవు
కన్నులారగ గంటి నీ కాంతి చెలియ!

అట వివిక్తస్థలమునందు నతివమీది
స్నేహ వాత్సల్యవిషయమై చెప్పి చెప్పి
పాడుమా యెల్లదిశల ఈపాటయనుచు
పాట నేరిపి వచ్చితి బాటవెంట.

ధూమశకటంబు వీడె చందురుని వెల్గు
లోన గోదావరీ సేతువును దరింప
తొంగిచూచితి ద్వారాన తొలుత నేర్పి
యున్న గేయము పాడదేమో యటంచు.

ఉద్ధృత స్వరగాంభీర్య యుక్తితోడ
ధవళ చంద్రికా వితతిలో తరుణకన్య
కా స్వరూపంబు దాల్చి పికస్వరమ్ము
తోడ నాకర్షణమ్ముగా పాడ దొడగె.

అద్ది కాతర వీక్షణు లగుచు నెవ్వ
రాలకించుచు నుండి రావలను చెపుమ!
హాయి కెవ్వరు! నాహృదయాంత రైక్య
మామ కాత్మీయ సర్వస్వ మధురఫలము.

కాని భావమ్ము గ్రహించినాను చెలియ!
మందహాసంపు కారణమిందు దెలిసె
వీడివచ్చెడి సమయాన వేరుతలపు
లుదయ మొందెను క్షమియింపు
మొక్కనూరు.

౫

ప్రథమునం జన గాంచియు భాగ్యదేవి
కాంచనట్టులు లోని కేతెంచి కిన్న
రాంగనవిధాన మధురసారంగ రాగ
మాలపించితి, వాలింప నాగినాడ.

నామనసు సంచలింప నానావిధాల
లోని కేతెంచినాను విలోకనమున
రాగ ముపసంహరించి సారంగి వైతి
వింతలోపల నే మేల యింతలజ్జ!

ఏను వచ్చెదనంచు నీ వెంచవైతి
వరుగుదెంచుట నీకు నాహ్లాదమగునొ
కాక ఆగ్రహహేతువో కాని యపుడు
చిత్తవృత్తి విజృంభణ చెప్పజాల.

పోదునా యన్న నవ్వులపోవు వగుదె!
నన్ను నెడబాసియుంట ఆనందమగునె
పోవ కాళ్ళాడ కున్నవి; పోవు పిదప
సౌఖ్యముగ నుందువేమి విశాలనేత్రి!

ఎంత యనురాగ మున్నదో యెరుగజాల
వెంత యున్నదొ యూహ నీ కెరుకలేదు.
భావసంభృత మగు నాదు స్వాంతపేటి
బరువులో నిండినట్టి కావడివిధాన.

౬

వెరవ పత్రికాముఖమున వెల్లడింతు
దేశదేశాలు చాటుచు తిరుగుచుందు
వెర్రివాడని యెవ్వరే వెక్కిరింప
కామినీకృతుడైన బికారి నందు.

ఎచట గాంచినగాని యాయిందుముఖమె
మాట యేదైన ఆపంచమ స్వరంబె
స్పర్శనం బైన ఆ తనుస్పర్శనంబె
ఐన నవి యన్నియును కొరం తైనవేమి?

సోమవదనము సురికున్నట్టులు
స్వామి ఆలోచించుచున్నా
వేమి! కానా తావకాలం
కార దేవతను?

కావు నాకండ్ల కిపుడు వికారరూప,
వీయలంకృతు లాత్మీయ విదళ నోగ్ర
దావ కాన లేంధనములు తరళచంద్రి
కావితతికి నీకును దప్పు కలదు చాల!

ఆగు మాగుము నాథ, నీ వీ
రాగ విముఖత యింతలోనే
రాగ రక్తం బౌను పాపం
బాగు పాదం బొత్తెదన్!

పూల లోపల మెలగు పాదం
బేల కర్కశపథములందున
బేలవై పరుగెత్తు చుంటివి
చాలు నిక నాథా!

వీథులందున నిట్టు, లంత
స్సౌధ సీమల మెలగు సఖి కవ

రోధ మా పరువెత్తు చుండుట
నాథ, అయ్యయ్యో!

ఊరకే యిటు చూచె దేటికి
పార మెరుగని హృదయ భారము
తీర లేదా! తావకాలం
కారదేవి నేనుగదా!

ఇద్దె కైకొను మంగుళీయక
మెద్ది హస్తము చాపు మిట్టులు
ముద్దు వేళ్ళ నలంకరించెద
మోదమున నాథా!

౨

జన్మమెత్తిన దేను నీసఖ్యమునకె,
జీవములు దాల్చి నిన్నె ఆసించియుంటి
పలుచవారుచునుంటి ని న్వలచియుంట
ఎన్నడు ప్రసన్న తవహింతో యీ మెమీాద!

మోవి నావిరి వెడల సమ్మోహదృష్టి
అనిమిషత్వంబు నొంది నిన్నరయు బుద్ధి
"నిగమ తోరణా" ద్వారాన నిలిచి నిలిచి
కాంచనేరక వచ్చితి కడకు నిట్లు.

మానస సరాన విహరించు మదమరాళ
రాజి నీదు రాజీవాంఘ్రి రాజిమీాద
పాండు పక్షములను విప్పి వాలుచున్న
దాలసింపక పరపు మపాంగ దృష్టి.

స్వర్ణదీపము మొసగ నావశము కాదు
ధనము ముడుపులు గట్ట నాతరము కాదు
నా యనంగను లేని అనాథయువతి
బాష్పకణముల బూజించు ప్రాణనాథ!

ఏ నొనర్చిన యపరాధ మేమి యిపుడు
ప్రేయసి యొనర్చు నపకృతుల్ పెద్దవైన
పాటిసేయక క్షమియింప పాత్రి మీారు
బాధపాల్ చేయుచున్నావు ప్రణయమూర్తి

మధ్య విఘ్నంబులేవొ యీామందగమన
పాదములకంటి కదల నీ వేది సుఖవు
కాని, యెప్పటికో యెట్లొ కాని జేరి
వాంఛదీర్చుకోగల వస్తమయముముందు.

ఓ గభీర గంగాతరంగోత్తమాళి
మీార లేనా మహోత్తాలధీరు లిపుడు
నా మనంబున విరహరత్నాకరంబు
పొంగుచున్నది, ఇంకను పొంగగలదు.

ఓ భ్రమరికా, హృదయమందు శుభ్రకాంతి
జల్లుచుండి ప్రేమగీతాలు వెల్లివిరిసె,
వాని నేర్చి యా పూవులవాడ కేగి
నావిరి చెవిలోపల నూది రావె వేగ!

△

# చిలకరంగు విమానం

## తాత కృష్ణమూర్తి

తాను చేసుకున్న మనో నిశ్చయానికి యెట్టి విఘ్నమూ కలుగ చెయ్యవద్దని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ "త్రాటిల్" తెరచినాడు రాయి. ధూళి రేపుతూ చక్రాలమీద శరవేగంతో ముందుకొక ఫర్లాంగున్నర దూరం పరుగెత్తి, క్రమంగా డేగవలె వయ్యారంగా పైకి లేచింది విమానం. కందిరీగ రొదతో వలయాకారంగా తిరుగుతూ, కోట చుట్టూ ఒకసారి ప్రదక్షిణం చేసి యెత్తుగా గాలిలో తేలిపోయింది తారాజువ్వవలె. ఉదయభానుని బంగరు కాంతిలో విలాసంగా విహరించే సీతాకోక చిలుకవలె రమ్యంగా రెక్కలమీద ఒరుగుతూ, కిందికీ మీదికీ ఊగులాడుతూ, ఉండి లేదనిపించేటట్టు తళుక్కున మెరుస్తూ, నిమిషంలో చూపుకు చిన్నదై అంతరిక్షాని కెగిసింది "ప్లేను."

క్రమంగా చెట్లు, చామలు, కొండలు, నదులు, పల్లెలు, అన్నీ పటములో అగుపడే రంగుల మరకలవలె ఎత్తు పల్లా లేకమై, చిన్నవిగా, ఆకారపరిణామాలనే కోల్పోయినట్లు మసక మసకగా కనపడినవి రాయ్ కళ్ళకు. దిలీపాస్తాన సరిహద్దులు దాటి, కొండల మీదుగా ఉత్తరం వైపు మళ్ళింది విమానం. ఇంజన్ మోత నిశ్శబ్దమైన నీలిమాకాశమున గాలి శ్రుతులతో కంఠము మేళవించి ఉత్సాహంతో స్వేచ్ఛగా పాడుకొనే విహంగ గానం వలె ఇంపుగా ఉంది, అతని చెవులకు. క్రమంగా 9, 10, 11 వేల అడుగుల యెత్తును సూచిస్తూ కదలింది ఆల్టిమీటర్ ముల్లు. గంటకు 90 మైళ్ళ గమనంతో రివ్వున పోతూ ఉంది ప్లేను.

నెల దినముల కిందటనే ఇంగ్లాండునుంచి వచ్చిన సరికొత్త "ఫాక్స్‌మాత్" విమానమది. వెండి రంగు రెక్కలు, చిలుకవన్నె దేహం గల అందమైన ప్లేను. ఇంజన్‌కు, కాక్‌పిట్‌కు నడుమ తన ఎదురుగా ఉన్న విశాలమైన కాబిన్‌లో ఒకరి ప్రక్క నొకరు అనవసరమైన యిరకటంతో శరీరాలు రాసుకుంటూ, ప్లేను ఇటూ అటూ కొంచెం ఒరిగినప్పుడల్లా ఒకరిమీద ఒకరు నొక్కుకుపోతూ, చిన్నపిల్లలవలె ఆనందంతో నవ్వుకుంటూ ఏవో ముచ్చటలాడుకుంటున్న యిద్దర్నీ అట్టే చూసినప్పుడల్లా, ఆ విమానాన్నీ, దాన్ని నడపడానికి అమర్చి ఉన్న యంత్ర సామగ్రినీ, తన సారథ్యాన్నీ, లోకాన్నీ, దేవుణ్ణీ—సర్వం మరచిపోయేవాడు రాయ్. హృదయంలో దావానలం రగిలేది. మోతాదు మీరి తాగిన వానికి వలె తల జుమ్మున తిరిగేది. కడుపులో ఏదో వికారం పుట్టేది. తప్పిపోతున్నట్లుండిన స్మృతిని మనోబలం చేత తిరిగీ స్వాధీనం లోనికి తెచ్చుకుంటూ కాబిన్ నుంచి దృష్టి మరల్చుకొని కంపస్ వేపు నిదానించి చూసే వాడు. సూటిగా ఉత్తరం వైపు చూపుతూ ఉన్న సూది గజగజ వణుకుతూ ఏ దిక్కు చూపుతున్నదీ తెలుసుకో లేక పోయేవాడు క్షణం వరకు!

నిర్మలమైన ఆకాశం. ఉదయం 8 గంటల వేళ. గాలి రివ్వున వీస్తూ, కొద్దిగామాత్రం తెరిచి ఉంచిన మైకా కిటికీలద్వారా కాబిన్ చొచ్చి, ప్రయాణీకుల మొగాలపై చురుక్కున తగిలేది.

"నీవైపు ఉన్న కిటికీ సాంతం మూసివేయి. చలిగా ఉంది." అన్నాది ఇందుబాల, రేగి కండ్లలో పడుతూ ఉన్న ముంగురులను ఎగదోసుకుంటూ. "చలిమాట దేవుడెరుగును! చెంపలు వాయిస్తూ ఉంది, యీగాలి!" అన్నాడు దిలీపకుమార్ కిటికీ మూస్తూ.

"బుద్ధిగా కూచోకపోతే వాయించదూ మరి?" అన్నాది, ఇందు మధురంగా నవ్వుతూ.

ఆమె నడుము మీదినుంచి తన చేతిని తీసవేసినాడు దిలీప్. ఇద్దరూ ఒకరిమొగం ఒకరుచూసుకొని నవ్వుకున్నారు.

"ఒక నిర్ణయంమీద నిలువలేని మనిషిని ఏమనాలి?......ఇట్లా అయితే నేను కాక్‌పిట్‌లో పోయి కూచుంటాను." అని బెదిరించింది, ఇందు.

క్షణం ఊరుకొని, "ఆకలితో యజమాని దయకోసం నిరీక్షిస్తూ, ఒక దుమ్ముముక్క నోటికి దొరకు తుందేమో అన్న ఆశతో ఎడంగా పాదాలచెంత గంతులువేసే పెంపుడు కుక్కకన్న అధికం లేదే నాబ్రతుకు! ఆమాత్రానికి కూడా అర్హత లేకుండా చెయ్యాలనా నీ పంతం?" అన్నాడు దిలీప్.

నవ్వుతూ ఇందుబాల, "అలాటి కుక్కమోస్తరు కాదే నువ్వు! భద్రంగా గూట్లో దాచుకున్న వెన్న, పాలు ఎట్లాగో దొంగిలించి యెత్తుకుపోయే పిల్లివరస నీది!" అన్నాది.

"ఏం లాభం? ఎలకమాంసం లభ్యమైతే తృప్తికాని, పాలు వెన్నకంటి అల్పాహారాలతో కడుపు నిండుతుందా పిల్లికి?" అన్నాడు దిలీప్ సరసంగా.

ముసిముసి నవ్వుతో వానిని కోరగంటచూస్తూ, యేమీ బదులుపలకలేదు ఇందు. అదివరకు గాలి ప్రయాణం అలవాటు లేక, కాబిన్‌లో ఒకమూలకుచేరి, భయంతో మొరుగుతూ ఉన్న జూలుకుక్క పిల్లను ఒడిలోకి తీసుకొని, ప్రేమతో తలనిమిరి దానికి ధైర్యమిస్తూ, నవ్వుతూ కూచుంది. కుక్క అంటే ఆమెకు వెర్రిసరదా యేమీలేదు కాని, బయలుదేరేముందు దిలీప్ రాకుమారుడు కోరి బహుమతిగా ఇచ్చిన ఉత్తమజాతి కూన అది.

సుమారు 4, 5 మాసములై ఉంటుంది దిలీప యువరాజుతో ఇందుకు పరిచయంకలిగి. మొదట రాయ్ ఒకనాడురాత్రి వానిని విందుకు పిలిచి, యింటికి తోడ్కొనివచ్చి, భార్య కతని పరిచయం కలుగ జేసినాడు.

"ఇందూ, ఇతడు మా ఫ్లయింగ్ క్లబ్‌కు ముఖ్యమైన మెంబరును, నాకు క్రొత్తశిష్యుడును అయిన దిలీపకుమార్ —యువరాజా."

చిరునగవుతో చెయ్యి యిచ్చి వానితో షేక్ హాండ్ చేసింది ఇందు.

అది మొదలు ఇందూరాయ్ దంపతులతో దిలీప్రునకు బాగా స్నేహం కుదిరింది. ముగ్గురూ చిన్నవాళ్లు, స్వేచ్ఛాప్రియులు. ఒకరి పట్ల ఒకరు చనువుగా మాయ మర్మములు లేకుండా వర్తించే వారు.

క్లబ్బులో విద్యార్థులకు ఎగరడం నేర్పే పైలట్ ఇన్‌స్ట్రక్టర్‌గా ఉండేవాడు రాయ్. ఇంగ్లాండులో తరిఫీదై, పెద్దపెద్ద పరీక్షలు పాసై, గొప్ప జీతం మీద ఆ క్లబ్బులో ఉద్యోగానికి కుదురుకున్నాడు. మనిషి 30 యేళ్ళ వాడే కాని, మంచి భారీ విగ్రహం. స్ఫురద్రూపి. ఆజానుబాహు. వస్తాదువలె చేతికండలు తిరిగి బలంగా ఉండేవాడు. ముఖం గంభీరంగా, దయగా, శాంతంగా కనపడేది. మధ్య పాపిట తీసేవాడు. మీసం ఉంచుకునే వాడు కాడు. హిందూ దేశానికి తిరిగి వచ్చిన పిమ్మటనే యిందుబాలను కలుసుకొని, ప్రేమించి, పెళ్ళి చేసుకున్నాడు. ఇంకా యేడాది నిండలేదు వివాహమై. దంపతు లొకరి నొకరు ఎంతో ప్రేమించుకునే వారు.

భర్తకంటె ఇందుబాల 9 యేళ్లు చిన్నది. ఎన్నదలసిన రూపవతి. తీరైన మొగం, చారడేసి కళ్లు, ముద్దులు కులికే పెదవులు, నిగనిగలాడే తుమ్మెద రంగు జుట్టు, తెల్లగా దంతంవలె మెరిసే నునుపైన మెత్తని ఒళ్లు, కలిగి మంచి యెపుగా, ఆరోగ్యంగా, నాగరీకంగా కనపడేది. మగవాళ్ళతో స్వేచ్ఛగా, ధైర్యంగా, దొరసానివలె బెదురు లేకుండా సంచరించేది. ఉన్నత విద్యలు నేర్చినది.

రాయ్‌ని ప్రేమించి పెండ్లాడిన తరవాత, అతని పైలట్ వృత్తిని గూర్చి అప్పుడప్పుడామె దిగులు పడుతూ ఉండేది - ఎప్పు డేప్రమాదం వచ్చి అతడు, అతని ప్రేమ తనకు దూరమౌతవో అని! అయినా, మనసులో తానెంత భయపడుతూఉన్నా, భర్తను ఆ ఉద్యోగం చాలించుకోమని ఎన్నడూ చెప్పేది కాదు. ఎగరడమంటే అతనికి ఎంత ఆనందం, ఉత్సాహం అన్న సంగతి గ్రహించుకుంది. వానితో తానూ అప్పుడప్పుడు విమాన మెక్కి, ఆ ఎగరడంలో ఉండే అద్భుతానందాన్ని అనుభవించి, అర్థం చేసుకుంది. మొదట్లో కొంచెం జంకేది ఎయిరోప్లేనెక్కడానికి; కాని మగనితో కూడా కాక్‌పిట్‌లో పక్కనే కూచొని, మీద చెయ్యివేసి, అతనితో కలిసి గాలిలో తేలిపోతూ ఉన్నప్పుడు, ఎంతో ధైర్యంగా సరదాగా ఉండేది ఆమెకు. మొదట ఉన్న తన పిరికితనానికి అప్పుడు తానే సిగ్గుపడేది. భర్త సారథ్య నైపుణ్యానికి ఆశ్చర్యపడేది. చిన్నపిల్లవలె చప్పట్లు చరుస్తూ, ప్రహ్లానంద భరితురాలై ప్రేమతో అతని భుజం ముద్దాడుతూ, "నువ్వు గంధర్వుడివి - దేవలోకం వదలి నాకోసం భూమిమీదికి దిగిన దేవుడివి!" అనేది. రాయ్ హృదయం సంతోషంతో పొంగిపోయేది, అట్టి సమయాలలో.

పావురా పిట్టలవలె గాలిలో ఎగురుతూ, ఒకరి నొకరు గాఢంగా ప్రేమిస్తూ, ఎంతో హాయిగా దినాలు గడుపుతూ ఉండేవారు ఇందూరాయ్‌లు.

దిలీపకుమార్‌తో ఇద్దరికీ స్నేహం ప్రబలుతున్న కొద్దీ ఆ దంపతుల జీవితాకాశాన క్రమంగా చిన్న చిన్న మబ్బులు పొడచూపినవి. అదివరకు గట్టిగా ప్రేమటంకంతో అతుకుకొని పోయిన వారి హృదయాలు ములికతో పెకలిస్తున్నట్లు కొంచెం కొంచెం విడబడసాగినవి. దిలీపునితో ఇందుకు చనువు ముదురుతున్న కొద్దీ ఎన్నడూ లేని అనుమానం, అంకురించినది రాయ్ హృదయంలో. కాని తన నట్లా ప్రేమించే స్త్రీరత్నాన్ని శంకించగల తన నీచ ప్రకృతికి తానే సిగ్గుపడాలనుకొని ఊరుకునేవాడతడు.

దిలీపునితో చెలిమి యిందుకు ఇంపుగానే ఉంటూ వచ్చింది; కాని అప్పుడప్పుడామె హృదయంలో రగిలే ఎంత కోర్కెలకు భయపడుతూ ఉండేది. ఏ నిమిషాన తన మనో దేహాలు స్వాధీనం తప్పిపోయి అతని వశమౌతాయో అని తనలో తాను కంపించి పోయేది. రాయ్‌ని, అతని అపార ప్రేమను తల్చుకొని మళ్లీ మనసు లొంగదీసుకుంటూ ఉండేది.

భర్త మనసులో కల్లోలం ఇందుకు తెలియదు. భార్య మనసులో ఆరాటం రాయ్‌కి తెలియదు. ఈ యిద్దరి మనసులలో సంచలనమూ దిలీపునకు అసలే తెలియదు. నిజానికి, ఎవరిపట్లా అన్యాయంగా వర్తించుదామన్న ద్రోహచింత ఆ ముగ్గురిలో ఎవరికీ లేదు. కాని...

దిలీపునకు రాయ్ అంటే అమిత గౌరవము. తన ప్రాణంకంటె అధికంగా ఎంచేవాడతని స్నేహాన్ని.

రాయ్ కంటె నాలుగైదేళ్లు చిన్నవాడు దిలీప్. సన్నగా, పొడుగ్గా, చామన చాయగా, నాజూకుగా ఉండేవాడు. మొగం నవ్వుతూ, కళ కళ లాడుతూ ఉండేది. కళ్ళలో తెలివితేటలు ప్రతిఫలిస్తూ మెరిసేవి. మీసాలను పెంచి, అందంగా కత్తిరించి, పామేడ్ రాసి నులిపి, సూది మొనగా దిద్దేవాడు. ఐరోపాదేశాలలో కొంతకాలం ఉండి వచ్చిన యువరాజా. ఇంకా పెండ్లి చేసుకోలేదు.

ఇందూరాయ్‌లతో అతడు మిక్కిలి స్నేహంతో, చనువుతో, దగ్గరబంధువువలె మెలిగేవాడు. మనిషి యెప్పుడూ కులాసాగా కబుర్లుచెపుతూ, నవ్వుతూ, నవ్విస్తూ, విచార మంటే యెలాటిదో యెరగని అదృష్టవంతునివలె కనబడేవాడు. ఇందుబాలతో ముచ్చటిస్తున్నప్పుడు కాని, ఆమెకు చేరువగా కూర్చున్నప్పుడు కాని. దిలీపుని హృదయం ఎందుకో అనంగ పరవశత్వంతో గంతులాడేది. ఆదివర కెన్నడూ స్త్రీలస్నేహంలో అతనికి అలాటి అద్భుతానందం లభించలేదు. డబ్బుగల యువరాజు గనుక, ఎందరెందరు స్త్రీలతోనో పరిచయం కలిగేది అతనికి. ఎన్నెన్ని ప్రేమసుఖాలనో చవిచూచినాడు కాని అతని ప్రణయానుభవాలలో ఎన్నడూ, ఏసౌందర్యవతీ ఇందువలె అతని హృదయకవాటంలో జొరబడి, యీవిధంగా మనిషిని వెర్రెత్తించి ఉండలేదు. ఇందుబాలను చూచిన మాత్రాన, తలచుకున్న మాత్రాన, అతని నరాలలో రక్తం దూకుడుతో నాట్యమాడుతూ ప్రవహించేది. హృదయం పాటలు పాడేది. ఇందు సాన్నిధ్యంలో ఉన్నప్పుడతనికి స్వర్గంలో ఉన్నట్లుండేది. ఒళ్లు తెలిసేది కాదు. అయినా రాయ్‌ని, రాయ్ స్నేహాన్ని మఱచిపోలేక, దూరంనుంచే ఆమెను పూజించ దలచుకునేవాడు. అంతకంటే అధికం ఆశించడానికి ఎందుచేతనో అతని అంతరాత్మ ఒప్పుకునేది కాదు. శరీరం మాత్రం ఎన్నోవిధాల తరుచుగా ఎదురు తిరుగుతూ గోలచేసేది.

దినాలు గడచినకొద్దీ దిలీపుని స్థితి దుర్భరం అయింది. ఇందు కూడా తనమీద మోహంకొద్దీ అట్లానే బాధపడుతూ ఉంది కాబోలని అనుకునే వాడప్పుడు—ఆమె చూపులను, మాటలను, చేష్టలనుపట్టి. దీక్షతోను, ఉత్సాహంతోను, రాయ్ శిక్షణ కింద విమాన సారథ్యం కొంతవరకు సాధించాడు దిలీప్. 'బీ' తరగతి పైలట్ లైసెన్సు సంపాదించగలిగాడు. రాయ్‌ని సలహా అడిగి, 27 వేలుపెట్టి స్వంతంగా తానొక "ఫాక్స్‌మాత్" విమానాన్ని కొన్నాడు. గంటకు 130 మైళ్ళ స్పీడ్ తో పోగలది అది. వెయ్యి పౌనుల బరువుతో పైకి 25000 అడుగుల యెత్తువరకు లేవగలది. "డీహావిలాండ్ ఎయిర్ కంపెనీ" వారి పురమాయింపున తయారయిన ఆకుపచ్చని విమాన మది. "జిప్సీ మేజర్ యింజన్"కలది.

ఆ విమానంలోనే ముగ్గురూ ప్రయాణం చేసి దసరా పండుగకు దిలీపుని సంస్థానానికి వెళ్ళి, వస్తున్నారిప్పుడు. మూడు దినాలు మాత్రం ఆ ఊళ్లో ఉండి, పండుగ వినోదాలలో పాల్గొని, వేడుక లన్నీ చూసి, విందులు కుడిచి, విజయ దశమి ఉత్సవం మర్నాడు వినోదార్థం వేటకని అడవులన్నీ తిరిగి ఏవో పిట్టల్నీ ఒక అడవి పందినీ కొట్టి, అలిసి పొద్దు కూకే వేళకు కోట చేరుకొని, ఆఖరు దినమని అర్ధరాత్రి వరకూ విందులు, వినోదాలు, ఆసవాలు, ఆటలు, పాటలు, ముచ్చట్లు మొదలైన వాటితో గడిపి, ఉదయం 7-30 గంటలకు కాఫీలు తాగి తిరుగు ప్రయాణంమీద విమానంలో బయలుదేరినారు. తానెంత ఉదార స్వభావంతో కళ్లు మూసుకొని, లెక్కచెయ్యకుండా ఊరుకుందా మనుకున్నా, ఆ ఉత్సవ దినాలలో ఇందూ దిలీపుల ప్రవర్తన పిచ్చెత్తించింది, రాయ్‌ని. అతని జోక్యమే లేనట్లు ఇద్దరూ ఎప్పుడూ కలిసి మసలేవారు. వాళ్ళ ముఖాలే చాటేవి ఒకరి నొకరు ప్రేమిస్తున్నట్టు. వాళ్ళ సరసోక్తులు, భావ వీక్షణాలు, మందహాసాలు—అన్నీ చూసీ చూడనట్టు కనిపెడుతునే

ఉండేవాడు రాయ్. కాని సుతిమించే వరకూ సహించుకోవడం కొంతవరకు నేర్చుకొన్నాడు, పాశ్చాత్య నాగరికత కలవాటు పడినవాడు గనుక.

ఆఖరుకోజున ఇద్దర్నీ డాబామీద వెన్నెట్లో ప్రత్యక్షంగా చూశాడు, ఒకరికొగిట్లో ఒకరు ఉండడం. దిలీపుని మెడచుట్టూ చేతులు పెనవేసి, ముఖంఎత్తి ముద్దులు పుచ్చుకుంటూఉంది, ఇందు. నిశ్చేష్టుడై క్షణంవరకు అదృశ్యం నిజమా, కలా, అని సందేహించాడు రాయ్. రోడ్డుమీద అజాగ్రత్తగా పడుకున్న కుక్క నడ్డిపైనుంచి బరువైన బండిచక్రం ఎముకలను కటకటా పిప్పిచేస్తూ దొర్లివెళ్ళినప్పుడు అది ఎంతబాధ పడుతుందో, అంతబాధపడ్డాడు. ఏం చెయ్యడానికీ తోచలేదు. ఇంతలో వాళ్ళిద్దరూ విడబడి, తాను నిల్చున్న మెట్లవైపే వస్తున్నట్లు పొడగట్టింది అతనికి. సన్నసన్నగా వెనకకు మళ్ళి, హాలులో సోఫామీద చతికిల పడ్డాడు.

ఇంకో ఐదునిమిషాలలో ఇద్దరూ కిలకిలా నవ్వుకుంటూవచ్చి కలుసుకున్నారతన్ని. రాయ్ ఏమీ మాటాడలేదు. టేబిలుమీది సీసాలో విస్కీ గ్లాసునిండా పోసుకొని దించకుండా తాగుతున్నాడు, వాళ్లు వచ్చేసరికి. అరాత్రి భోజనానంతర వినోదాలలో రాయ్ అట్టే ఉత్సాహంగా కనపడక పోవడానికి కారణం బహుశః అతనికి ఒకచుక్క జాస్తి అయిందేమో అనుకొని నవ్వుకున్నారు ఇందూ దిలీపులు.

చికిత్సకు లొంగనంతలోతుగా గాయపడింది రాయ్ హృదయం. ఆదివర కతన్ని బాధిస్తూ ఉండిన శంకలన్నీ రుజువుకు వచ్చి, రూఢిపడి, తన ప్రేమను, మగతనాన్ని, భర్త్రాధికారాన్ని ధిక్కరించి వెక్కిరిస్తున్న ట్లనిపించింది, అతనికి! ఇందూ దిలీపులు అన్యోన్యానురక్తులై, తనకంట్లో ధూళికొట్టి రహస్యంగా కలుసుకుంటూ క్రీడిస్తున్నారని స్థిరపరచుకున్నాడు రాయ్.

ఇద్దర్నీ నిలవదీసి అడిగితే? ...... ఏం లాభం? దొంగపని చేసినవాళ్లు తనతో నిజం చెపుతారా? ఒకవేళ ఒప్పుకొని నిజమే అని చెపితే, తన బాధ యేమైనా నివారణ అవుతుందా? మరింత దుస్తర మైపోదూ? ...... తన మీద ప్రేమలేదని చెప్పి విడిపోయి, దిలీపునితో లేచిపోతానని యిందు కాని అంటే! ఆమెను వదలి తాను జీవించగలడా? ఆమె నూరు తప్పులు చేసినా సరే, ఆమె మీది మమతను తాను చంపుకోగలడా? ...... అంత గాఢమైన, స్థిరమైన, అగాధమైన వలపు అతనిది!

దిలీప కుమార్ తన నిట్లా మోసం చేస్తాడని కలలోనైనా అనుకోలేదే తాను! నాడు బ్రూటస్ కత్తిపోటుకు బాధపడిన సీజర్ వలె బాధపడ్డాడు రాయ్.

ఇంతకూ దిలీపుని అనవలసిన పని లేదేమో అనుకున్నాడు మళ్ళీ. ఇందు రూపం అట్లాటిది—పురుష హృదయాలను రెక్కలపురుగులవలె ఆకర్షించి దగ్ధం చేసే తీక్షణమైన దీపం వంటిది ఆమె అందం! మెదడు వేడెక్కించుకొని తీవ్రంగా ఆలోచించాడు రాయ్, కర్తవ్యమేమి టని. ఏమీ పాలుపోలేదు. ఇందు ప్రేమను కోల్పోయిన తన బతుకు వ్యర్థమని తలచి, పగసాధింపు కందుకు యత్నించే కన్న ఆత్మహత్య చేసుకోవడం మేలు కాదా అనుకున్నాడు. అట్టి త్యాగశక్తి తన ప్రేమలో ఉన్నదని అతని నమ్మకం. తా ప్రేమించిన స్త్రీకి సౌఖ్యము కూర్చడమే తాను కోరవలసినదని యెంచి సంతోషంతో ప్రాణములు అర్పించిన సిడ్నీకార్టన్ కథ జ్ఞప్తికి వచ్చింది రాయ్‌కి.

కాని ఇందును దిలీపుడు సుఖపెట్టి కలకాలం ప్రేమిస్తాడని యేమిటా నమ్మకం తనకు? ఉభయ భ్రష్టత్వం చేసి దాని బతుకు మట్టిలో కలుపుతాడేమో?.........

తాను చచ్చిన తరవాత ఎవరిగతి ఏమైతే తన కేమనుకున్నాడు మళ్ళీ.

అట్లాకాదు—తాను చెయ్యదలచుకున్న త్యాగానికైనా కొంత విలువ ఉండాలి, అర్థం ఉండాలి' ప్రయోజనం ఉండాలి !

దిలీపునే విడదీస్తే?...వాడిమీద బెంగపెట్టుకొని గుండెపగిలి మరణిస్తుందేమో యిందు? అతలపుతో గుండెలో భయంకరమైనపగ, యీర్ష్య పొంగుకొచ్చినవి రాయ్‌కి. ఇందుబాలమీద చెప్పరాని ద్వేషం కలిగింది. డెస్డిమోనాను పీకపిసికి చంపేముందు ఒథెల్లో పడిన హృదయావేదన అతడూ అనుభవించాడు ఆముహూర్తంలో. మనసులో ఎన్నోవిధాల యుద్ధంచేసి, తుదకొక దారుణమైన సాహస కృత్యానికి నిశ్చయించుకున్నాడు— తిరుగు ప్రయాణంలో విమానంతో సహా ముగ్గురూ ఏక ముహూర్తంలో అంతము కావలసినదే అని !............

ప్లేను నడుపుతూ ఎదురుగా ఉన్న కిటికీవంటి పెద్ద గాజు రంధ్రంలోనుంచి కాబిన్ వేపు చూసినప్పుడల్లా, తన వైపు వీపులాని సుఖాసీనులై ఉన్న యిందూ దిలీపుల భుజాలు, తలలు మాత్రమే కనపడేవి రాయ్‌కి. ఒక్కొక్కప్పుడు వాళ్లు ప్రక్కగా ఒరిగి ఉన్నప్పుడు అసలు ఏమీ కనబడేది కాదతనికి. ఇంజన్ ఝూంకారంలో వాళ్ళ సంభాషణ ఏమాత్రం కూడా వినబడడానికి అవకాశమే లేదు. కాబిన్‌లో నైనా ప్రక్కవాళ్ళ చెవిలో నోరుపెట్టి బిగ్గరగా అరిస్తేనే కాని ఒకరిమాట ఒకరికి వినిపించదు. కాబిన్‌లోనుంచి పైలట్‌తో సంభాషించాలంటే టెలిఫోన్‌వలె అమర్చిన గొట్టం ద్వారా మాట్లాడాలి, గొంతు చించుకొని.

ఇందూ దిలీపు లొకరి ప్రక్క ఒకరు చేరువగా కూర్చోడం మాత్రమే గమనించగలిగి, తనకు ఈర్ష్యా క్రోధములు రేపే యితర విషయాలను ఊహాశక్తివల్ల తానే కల్పించుకొని, మనసులో తుపానును లేవనెత్తుకొంటూ బాధపడ జొచ్చినాడు రాయ్. హఠాత్తుగా ప్లేనును పడద్రోసి ధ్వంసం చేదామన్న భయంకరమైన తన మనో నిశ్చయాన్ని తల్చుకొని తనలో తాను కంపించిపోయేవాడు.

ఎదురు గాలిని ఢీకొంటూ, గాలికెరటాలపై ఉయ్యాల లూగుతున్నట్లు ఒరుగుతూ, తేలుతూ, ఉత్తర ముఖంగా వందమైళ్ల వేగంతో పోతూ ఉంది ప్లేను. అతని కుడి చెంపమీద సన్నని యెండ పడుతూ ఉంది. జాయ్‌స్టిక్‌ను తనవైపు గుంజుకొని యింకా యెత్తుగా లేపినాడు ప్లేనును. 12 వేల అడుగుల యెత్తు సూచించింది ఆల్టీమీటర్. ఏకి విరజల్లిన దూది పింజలవలె అక్కడక్కడ చిన్నచిన్న మబ్బులు ఎదురైనవి. గాలి చలిగా వీచింది.

మరికొంత సేపటికి సూర్యుణ్ణి కప్పేస్తూ నల్లని పెద్ద మబ్బొకటి యెదురైంది. హఠాత్తుగా కళ్లు మిరుమిట్లు గొలిపే టట్లొక సన్నని నీలి మెరుపు మెరసింది. ఇంజన్ ధ్వనిలో ఉరుముల గర్జన వినరాలేదు. మరుసటి క్షణంలో రాళ్ళు రువ్వినట్లు ఫెళ ఫెళ ధ్వనులతో పెద్ద పెద్ద చినుకులు పడజొచ్చినవి. ప్రళయమైన గాలితో జోరుగా ప్రారంభించింది వర్షం. విమానం చుట్టూ దట్టమైన మేఘాలు ఆవరించినవి. భూమ్యాకాశాలు రెండూ ఏకమై చీకటిలో ముంచినవి ప్లేనును. తనలో తాను గిర్రున తిరుగుతున్నట్లనిపించింది రాయ్‌కి. ప్లేను ఎటుపోతున్నదీ, ఏ మవుతున్నదీ, తెలియ లేదతనికి. గొంతు పగిలేటట్లు అరుస్తున్న యింజన్ చప్పుడు మాత్రం ఇతర ధ్వనుల నన్నిటినీ మించి, చెవులు బ్రిద్దలు చేస్తూ ఉంది.

గుండీ నొక్కి కాక్‌పిట్‌లో విద్యుద్దీపం వెలిగించాడు రాయ్. డాష్ బోర్డ్ మీద మెరుస్తున్న యంత్రపరికరాలు అన్నిటినీ ఒక్కసారి దీపం వెలుగున వరసగా చూసుకున్నాడు,—వాయువేగ సూచన యంత్రం, కంపస్, గడియారం, ఆర్టిఫిషల్ హారైజన్, ఆల్టీమీటర్, ఫ్యూయల్ గేజ్, గాలి ఒత్తిడి తెలిపే యంత్రం, మొదలయిన వన్నీ. మబ్బులను పెకలించు కుంటూ, తడిసి బరువెక్కిన రెక్కలతో శక్తికొద్దీ యీదుకొని పోసాగింది విమానం.

తన సంకల్పాన్ని ఆమోదించి దేవుడు కూడా గాలివానతో తనకు తగిన సహాయం చేయ బూనినట్టుగా భావించుకున్నాడు రాయ్. కనురెప్పపాటులో ప్లేనును వెయ్యి చెక్కలయేటట్లు పడద్రోయడానికి అనుకూలమైన మంచి సమయమది! ఆ తలపుతో అతనికి తల గిర్రున తిరిగి, కళ్లు చీకట్లు కమ్మిన ట్లయింది. చేతులు వణక నారంభించినవి. గుండె దడదడ లాడింది.

ఇంతలో, "రాయ్, రాయ్, ...... ఏమిటీ గాలివాన ప్రళయం ? ... నాకు భయం వేస్తూఉంది?" అని గొట్టంలోనుండి అస్పష్టంగా వినవచ్చింది ఇందు స్వరం.

గాలం వేసి చేపను గుంజినట్లు ఆమె కంఠధ్వని రాయ్ హృదయాన్ని గుంజింది బాధాకరంగా. కాని మనోనిశ్చయాన్ని తల్చుకొని గుండె రాయి చేసుకున్నా డతడు. జబాబియ్యకుండా ఊరుకున్నాడు.

ఇంకా యేమో అంటూఉంది యిందు. వినిపించుకో దలచుకోలేదు రాయ్. ప్లేను అతని స్వాధీనంలోనుంచి తప్పించుకో యత్నిస్తున్నట్లు ఇటూ అటూ ప్రమాదకరంగా ఒరుగుతూ పోసాగింది. రాయ్‌కి పౌరుషం కలిగింది. ప్లేను తన చెప్పుచేతలలో అణగి ఉండవలసిందే కాని, అట్లా దాని చిత్తం వచ్చినట్లు పోవడమా మరి !

ఎక్కువ వేగంతో ప్లేను నడుస్తూ ఉన్నప్పుడు, కంట్రోల్స్‌ను ఆతురతకొద్దీ బలంగా కదిపితే రడ్డర్, ఎయిలిరాన్, మొదలయినవి కాగితం చిరిగినట్లు చించుకుపోతాయి, ఎక్కడికక్కడ. కాబట్టి రాయ్ బహు జాగ్రత్తగా జాయ్‌స్టిక్‌ను లాక్కొని పైకి లేపినాడు ప్లేనును. 15 వేల అడుగుల యెత్తునకూడా మబ్బులు వదలలేదు. వర్షం కుంభ వృష్టిగా కురుస్తునే ఉంది. చలివల్ల చేతులు వణుకుతూ కొరడు బారుతున్నాయి. ఒంట్లో రక్తం పేరుకొని పోతూఉందా అనుకున్నాడు రాయ్. ప్రమాదకరమైన తుపానులో చిక్కుకొని అవస్థపెడుతూ ఉంది ప్లేను.

మళ్లీ వినవచ్చింది యిందు పిలుపు, భయకంపిత స్వరము. ఆమె కంఠధ్వని విద్యుచ్ఛక్తివలె అతని శరీరమంతటా వ్యాపించి, వానిని ఆదివర కావహించిన జెలసీదయ్యాన్ని అప్పటిమట్టుకు పోద్రోలింది. దగ్గరలో ఉరుముల చప్పుడు వినవచ్చింది. ఇందు ప్రేమను శంకించరాదని ఆకాశవాణి ఆ విధంగా తనకు బోధిస్తున్నట్లు తోచింది రాయ్‌కి.

గొట్టంలోనుంచి, "రాయ్!" అని మళ్ళీ పిలిచింది యిందుబాల.

తనపేరు ఆవిధంగా ఉచ్చరించడంలోనే యిందు తన అసాధారణ ప్రేమను వ్యక్తపరుస్తూ ఉందని అనుకున్నాడు రాయ్. ఆపిలు పామె హృదయాంతరాళమునుంచి వెలువడిన ప్రేమశంఖారవము వలె వినవచ్చింది అతని చెవులకు. మంత్రించినట్లు కాఠిన్యమువిడిచి వానిహృదయం వెంటనే మెత్తపడింది.

"ఇందూ, భయపడకు. త్వరలో యీతుపాను ప్రదేశందాటి బయటపడగలందులకు దేవుని ప్రార్థించు" అని గొట్టంలోనుంచి అరచినాడు రాయ్.

"నువ్వే నాదేవుడివిగా" అన్నాది యిందుబాల.

ఆమె మాటలకు పరిసంతోషం కలిగింది రాయ్‌కి. తన వంత అమాయకమైన భక్తితో నమ్ముకున్న మనిషి నిజంగా తనపట్ల ద్రోహంచెయ్యగలదా అని సందేహించాడు తనలో. అయితే కడచినరాత్రి తాను చూసిన దృశ్యాన్ని సమర్థించుకో వచ్చునేమో, శాంతంగా యోచిస్తే?

"ఇందూ, యిందూ!" అని మళ్లీ పిలిచినాడు, రాయ్.

జబాబు లేదు.

"అడుగునుంచి దూరి వస్తూ ఉంద నీ దెగ్గిరికి." అని సమాధాన మిచ్చినాడు దిలీపకుమార్.
ప్లేను సవ్యంగా ఎగరక, సన్నదివముపుతో పక్కగా ఒరుగుతూ, కారణంలేక దిగజారుతూ, చిక్కులు పెడుతూ ఉంది రాయ్‌ని.

కాక్‌పిట్‌లోకి శ్రమమీద జంగురుకొనివచ్చి, భర్తపక్క చతికిలపడింది యిందుబాల, వణకుతూ.

"నాకిప్పుడు కొండంత ధైర్యంగా ఉంది," అన్నాది ఆమె, అతని భుజాన్ని చెంపరాస్తూ.

"ఇక్కడ చలికి తాళలేవు. వెళ్లి కాబిన్‌లో రగ్గు కప్పుకొని కూచో," అన్నాడు రాయ్.

"ఫరవాలేదు. ఇల్లా నిన్ను అనుకొని కూచుంటే ఎంతో వెచ్చగా ఉంది," అన్నాది ఆమె నవ్వుతూ.

ఆమె ఒడలితాకుడుకు రాయ్ శరీరం పులకరించింది. అతని దేహంలో ఒక నూతనశక్తి, మనసులో ఒక నూతనకాంతి ఉదయించినవి. తన నేర్పువంతటినీ వినియోగించి నడుపుతున్నాడు ప్లేనును. వాన, గాలి, ఏమాత్రం తగ్గుతున్నట్లు లేదు.

"ఇంకా పైకి లేచిపోతే మబ్బులనుంచి తప్పించుకోలేమూ?" అన్నాది యిందుబాల.

"లాభం లేదు. ఇక్కడనే గాలి ప్రెష్షర్ సముద్రమట్టంలో ఉండేదానిలో సగానికి తక్కువగా ఉంది. ఇంకా ఎత్తుగా పైకి వెళితే, అసలు తిన్నగా ఊపిరి సలపదు, ప్రాణవాయువు చాలక" అన్నాడు రాయ్.

జాయ్‌స్టిక్ తోను, రడ్డర్ తోను కొంతసేపు అవస్థపడి, నిరాశతో అతడు, "ఇందూ, నువ్వు కాబిన్ లోనికి వెళ్ళిపో. ప్లేను పైకి లేవడం లేదు,— కిందికి ప్రమాదకరంగా దిగజారుతూ ఉంది, ఎందు వల్లనో!" అని కొంతసేపు తన పనిలో నిమగ్నుడై, మళ్ళీ, ఒకవేళ అవసరమైతే నేను కేక వేసినప్పుడు నువ్వు, దిలీపు, వెంటనే పారచూట్స్ పట్టుకొని ప్లేనులోనుంచి గెంతపోవాలి!" అన్నాడు విధిలేక. వెల వెల పోయింది యిందుబాల.

"మరి నువ్వో?"

"నా మాటకేమి? ఎట్లాగో తంటాలుపడి దేనికీ గుద్దుకోకుండా ప్లేనును వాల్చడానికి యత్నిస్తాను— ఆపైని భగవదిచ్ఛ! ఏమైతే అది అవుతుంది."

"రాయ్, క్షమించి నన్ను గెంత మనకు - గెంతడానికి జడుపనుకోకు... నువ్వు నీ ప్రాణానికి తెగిస్తూ ఉన్నప్పుడు, నేనూ నిన్ననుసరించవలసిన దాన్నే!" అని యిందు వణుకుతూ మీద చెయ్యి వేసి, ముద్దులాడింది భర్తను.

"నాతోనే ఉండి మృత్యువు నెదుర్కొంటా నంటుంది కాని; ప్రాణాలను దక్కించుకొని దిలీప్‌తో సుఖపడదామని కోరదుకదా? ఇట్టి భార్యనా నేను శంకించి, ద్వేషించి, నిర్మూలం చేయదలచింది? ఎంత మూర్ఖుణ్ణి!" అని తనలో ఏమేమో అనుకున్నాడు రాయ్.

ఆలోచించడానికి గాని, మాట్లాడడానికి గాని, అవకాశ మివ్వడంలేదు ప్లేను.

ఆనిమిషంలో ఇందుపట్ల మోహమేకాక, ఒకవిధమైన కొత్తగౌరవం మొలకెత్తింది రాయ్ హృదయంలో. ఆమె తనకెట్టి అసాధారణప్రేమతో ఎన్నుతూ ఉన్నదో అప్పుడు విశదపడి నట్లయింది ఆతనికి. అదివరకతని గుండెను పీక్కొని తింటూఉన్న అనుమానభూతం పూర్తిగా వదలిపోయింది. జీవితంమీద మళ్లీ నూతనకాంక్ష పుట్టింది! అదివరకల్లా విమానంతోసహా భార్యను, మిత్రుణ్ణి, తనను, అంతంచేయడానికి సంకల్పించుకున్న దృఢచిత్తుని కిప్పుడు ఎట్లాగైనా తంటాలుపడి, తన సారథ్యచాకచక్యాన్నంతా వినియోగించి, ప్లేనును సవ్యపరచి, తుపాను ముప్పునుంచి తప్పించి, క్షేమంగా బయటపడదామన్న ఆసక్తి ప్రబలమయింది.

"ఇందూ,.........నువ్వు నన్ను ప్రేమించడం లేదేమో అనుకున్నా నీ మధ్య!" అన్నాడు రాయ్ గద్గద స్వరంతో.

ఇందుబాల నోరు తెరచుకొని, దిగాలుపడి భర్త వైపు చూస్తూ, క్షణం ఊరుకొని బొటబొట కన్నీరు కార్చింది.

"రాయ్, రాయ్,..... నా ప్రేమను శంకించకు! ఎప్పటికీ నేను నీదాన్నే!......నాకు తెలుసు, నువ్వెందుకట్లా అనుమానపడ్డావో—నీది తప్పుకాదు. నాదే పొరపాటు, చాలా పొరపాటు!—అగ్నితో చెలగాట మాడబోయినాను. మరికాస్తలో ఒళ్లు కాల్చుకునే దాన్నే!......కాని కాల్చుకోలేదు......నమ్మవూ? నమ్మలేవూ,......?"

కంట్రోల్సును వదలి ఆనందంతో యిందును పెదవులమీద ముద్దు పెట్టుకున్నాడు రాయ్.

రాత్రి జరిగిన విషయమంతా ఉన్నదున్నట్లుగా ఏమీదాచక భర్తకు చెప్పాలనుకుంది యిందు. కాని ఆతుపాను ప్రళయంలో, గాలి రొదలో, ప్లేను గడబిడలో, ఏం మాట్లాడడానికీ వీలుగాని, వ్యవధిగాని లేకపోయింది. విమానాన్ని తన స్వాధీనంలోకి తెచ్చుకుందుకు యంత్రసామగ్రితో రాయ్ పడుతున్న అవస్థలన్నీ ఆతురతతో, ఆందోళనతో, ఊపిరి బిగపట్టి చూస్తూ నోరు మెదపక ఊరుకుంది యిందు. సినిమా దృశ్యంవలె ఆమె మనోవీథిలో రాత్రి జరిగిన నాటకమంతా తిరిగి ప్రదర్శితమయింది. చల్లగాలికి ఒంటరిగా ఆమె డాబామీద చంద్రుణ్ణిచూస్తూ నిల్చోడం- దిలీపకుమార్ ఎందుకో అక్కడికి వచ్చి ఆమె అందాన్ని పొగడుతూ ఆమెతో ఏమేమో సరదాగా సంభాషించడం - ఇద్దరూ అకస్మాత్తుగా కట్లుతెగిన రెండు ప్రవాహాలు కలుసుకున్నట్లు అణుచుకోలేని మోహావేశంతో కౌగలించుకోవడం - ఎన్నాళ్లనుంచో అట్టి సమయంకోసం ఎదురుచూస్తున్నట్లు వెర్రిగా ఎంతకీ తనివితీరనట్లు ముద్దులాడుకోవడం- కొంతసేపటి కామె తెలివి తెచ్చుకొని తటాలున కౌగిలివీడి జరిగినదానికి పశ్చాత్తాపపడడం - సిగ్గు, కోపం, దుఃఖం ముంచుకొచ్చి ఆమె యేడిస్తే దిలీప్ ఓదార్చడం- మళ్లీ అట్లా అవివేకంగా ఒళ్ళుమరచి ఎప్పుడూ ప్రవర్తించరాదని యిద్దరూ తీర్మానించుకోవడం - రాయ్‌ని మోసం చెయ్యక, తమ ప్రేమను పవిత్రంగానే ఉంచుకొని యిద్దరూ ప్రియులుగా కాక స్నేహితులుగా మాత్రం ఉండవలెనని నిర్ణయించుకోవడం - అన్నీ జ్ఞప్తికి తెచ్చుకుంది యిందు.

భూమిని ఢీకొనడానికి ముక్కుమీద ఒరుగుతూ ఉన్న ప్లేనును ఎట్లాగో స్వాధీనంలోనికి తెచ్చుకొని పైకి లేపుతూ బతుకుజీవుడా అనుకున్నాడు రాయ్. మళ్ళీ తన ఆజ్ఞలకు లోబడుతూ, తేలికగా, సవ్యంగా మీదికి లేచింది ప్లేను. గాలి జోరుకూడా కొంత తగ్గింది. ఇంజన్ మోతలో ఎట్టి అపస్వరమూ వినరాలేదు.

“ఇందూ, యిక ఫరవాలేదు. ప్రమాదం దాటింది. మబ్బులుకూడా విడిపోతున్నాయి. ప్లేను చెప్పినట్లు వింటూ ఉంది. యిప్పుడు!” అని సంతోషంతో కెవ్వున అరిచాడు రాయ్.

భూమికి 10 వేల అడుగుల యెత్తున నిమిషానికి రెండుమైళ్ళ గమనంతో నిశ్చలంగా పోతూ ఉంది ప్లేను. మేఘాల చీకటి తగ్గింది.

“దిలీప్, అద్భుతమైన విమానమిది! తప్పదనుకున్న గండం దాటించి, మనలను కాపాడింది.” అని గొట్టంలోనుంచి అరచినాడు రాయ్.

వాన, గాలి తగ్గినవి. త్వరలో సూర్యుడు మళ్ళీ ప్రత్యక్ష మవుతాడన్నఆశ గొలిపింది ఆకాశం. యుద్ధంలో జయంపొందిన వీరునివలె గర్వపడ్డాడు పైలట్.

ఇంతలో ఆకస్మికంగా కళ్లు జిగాలుమని దృష్టి తప్పినట్లు ప్లేనుకు దగ్గరగా గొప్ప కాంతితో ఒక మెరుపు మెరిసింది. ఆ వెంటనే ఆకాశం బద్దలయినట్లు పిరంగి ధ్వనితో భయంకరమైన ఉరుము వినవచ్చింది. ప్లేను వణుకుతూ పక్కగా ఒరిగింది.

పిడుగుపడి యిందూరాయ్‌లు కాక్‌పిట్‌లో స్మృతి తప్పి పడిపోయినారు. ప్లేను నిప్పంటుకుంది. విమానం ఎత్తుగా, ఇంకా ఎత్తుగా పోతూనే ఉంది. పైన భగభగా మంటలు లేచినవి. ఆకాశం ఎర్రబడింది.

ప్లేనువేవో కొన్ని భాగాలు, ఒక రెక్క, జారి క్రిందపడినవి. పెద్ద బాంబు పేలిన ధ్వనితో విమానం బద్దలయి మండుతూ కిందపడింది, ముక్కల కింద. సర్వం ఆగింది.

ఈ భీభత్స దృశ్యాన్ని హడలిపోయి చూస్తూఉన్న సమీప గ్రామవాసులు కొందరు గుంపులుగా పరుగెత్తుకొని వచ్చారు, విమానం పడిన మైదానం వద్దకు. నామరూపాలు లేక ప్లేను గుండపిండి అయింది. దానిలో ప్రయాణీకు లెవరో, ఎందరో, ఏమీ తెలియలేదు. వాళ్ళ కళేబర భాగాలు మాత్రం అక్కడక్కడ కొన్ని విరజల్లి ఉన్నవి. ఒక కాలు, ఒక చెయ్యి, తోలూడిన ఒక మొండెం, పగిలిన రెండు పుర్రెలు, మాంసంతోను మట్టితోను కలిసి చిక్కపడిఉన్న, పొడుగుపాటి జడ, నల్లని బొచ్చుతో ముద్దగా ఉన్న కుక్కపిల్లతోలు, దుమ్ములు, పేగులు, గుడ్డపీలికలు మొదలయినవి!



# ఉత్ప్రేక్ష

## నాగరాజామాత్యుడు

ఆకస మ్మంటుకొన్న దదే కవోష్ణ
రక్తరాగరంజితనిశారంభ వేళ!

పావకార్చుల తోరణపంక్తు లగుచు
సామిదగ్ధపయోధరచయము వారు;
అలముకొనె నేలకై వ్రాలి యార్చి చిచ్చు
లబ్ధిరాజార్ద్రమృదువీచికాధరముల
నీలిమెయి పంగి, నింగి, చుంబించు కడల;—

నా యెడద సడగు విరహానలన గాలి
గాల బ్రదు కెన్నడో స్వప్నసౌధవిధాన
శిథిలమై ద్రుగ్గి భస్మావశిష్ట మయ్యె:
ఆర్పరా రెవ్వ రయ్యయో ఆగగలనె
యిమ్మహావహ్ని గూడ నన్నే చేరంగ?—

ప్రత్యహఃకృత్య నిత్య స్వరప్రవృత్తి
కష్టజీవికి సత్యరాగామితోత ని
శామధురసాప్తికాజ్ఞాతసౌఖ్య మట్లు
ప్రళయభీభత్సపరపరమపరిశాంతి
పొరలు నాలోన నూత్నప్రభూతకాంతి!—

ఏల సాగరరాజు వినీలహృదయ
మింత యుప్పొంగ ముదమున నెగసి పడును?

సడలని నిరాశ మూల్గు నిశ్వాసములకె
యింత కళవళ మయ్యె, దా నెద్దియేని
యందియుండదుగద యీప్సితార్థసిద్ధి!

Δ

# " శ్రీ వాణీ గిరిజా శ్చి రా య "

విశ్వనాథ సత్యనారాయణ

'శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షో ముఖాఙ్గేషు యే
లోకానాం స్థితి మావహన్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురైః
భూయాసుః పురుషోత్తమామ్బుజభవ శ్రీకన్ధరా శ్శ్రేయసే!'

నన్నయ్య ఆంధ్రభారతము వ్రాయబోతూ మొదట సంస్కృతశ్లోకం వెయ్యడం ఎందుకని పూర్వము ఒకరు చమత్కారముగా వ్రాశారు. ఆంధ్రానికి సంస్కృతం తల్లి. భారతీయుల సర్వ మంత్రాలకూ సంస్కృతము వాక్ఛక్తి. సంస్కృతమైన ఋషి వాక్కు అటువంటి సంస్కృతంలోనే వెలువడుతుంది. నన్నయ ఋషి. 'అవిరళ జప హోమతత్పరుడు, నిత్యసత్యవచనుడు.'

ఈ నిత్య కర్మానుష్ఠానమూ, ఈ నిత్య సత్యవచనత్వమూ నన్నయకు ఋషిత్వము తెచ్చినవి. ఋషిలో బహుగుణాలు భాసిస్తవి. ఆయనమాటను అర్థము అనుసరించడము అందులో ఒకటి దీన్నే భవభూతి 'ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి' అన్నాడు. ఆ అర్థాన్ని ఋషి భావించవలసిన పనిలేదు. వాల్మీకినోట బయలుదేరిన 'మానిషాద'లో రామాయణార్థము మొట్టమొదట ఉద్దిష్టం కాదు. అలాగే ఈ చెప్పబోయే 'శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ' లో అర్థము కూడా నన్నయ ఉద్దేశము కాకపోవచ్చు, కాని అలా జరగడం ఆశ్చర్య కరమూ, ఆయనకు ఋషిత్వసిద్ధి దాయకమూ !

'పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరాః శ్రేయసే భూయాసు.' పూర్వసంస్కృతకవులంతా కావ్యాదిలో మంగళాచరణముతో త్రిమూర్తులను పేర్కొనలేదు. నన్నయ్యే దీనికి మొదలు. పురుషోత్తముడు నారాయణుడు; అంబుజభవుడు బ్రహ్మ; శ్రీకంధరుడు పరమేశ్వరుడు. నన్నయ నారాయణ శబ్ద భవము, తిక్కన కవిబ్రహ్మ, ఎఱ్ఱాప్రెగ్గడ ప్రబంధ పరమేశ్వరుడు. వీరు ముగ్గురూ శ్రేయస్సుకోసం—ఆంధ్రభాషాశ్రేయస్సుకోసము—అగుదురు గాక ! వీరు వరసగా శ్రీ వాణీ గిరిజలను వక్షోముఖాంగాలలో

‘చిరాయ దధతః’ చిరకాలము ధరించేవారట. ఈ చిరాయ శబ్దబలంచేత తెనుగుభారతము పూర్తి అయ్యేసరికి రెండువందల యేళ్ళు పట్టింది!

శ్రీ అంటే ముక్తి. నన్నయ గీతాశాస్త్రములో కనిపించే పరదైవము, నారాయణుని వలె సర్వశక్తిమంతుడై, అపేత వాఙ్మయ దశనుంచి ఆంధ్రానికి ముక్తి కలిగించి, స్థితికి తెచ్చినాడు. స్థితి కలిగిన దాన్ని తిక్కన సృష్టి చేసినాడు. సృష్టి అయిన తర్వాత స్థితి కలుగుతుంది అనుకోరాదు; స్థితి కలదానికే సృష్టి. ఆసృష్టికి, ఆప్రపంచానికీ వాణి అవసరము. ఆవాణిని — అంటే, బహుళమైన తెనుగు శబ్దజాలాన్ని తిక్కన స్వీకరించి సృష్టి చేసినాడు. ‘గిరిజా’ గీః అనేశబ్దానికి సప్తమితో అలుక్సమాసము. వాక్కులో పుట్టింది అని అర్థము. ఈవాక్కు ఏవాక్కు? నన్నయ తిక్కనల ఇద్దరివాక్కు. వారిద్దరినీ సమృద్ధిగా సర్వాంకషంగా అనుకరించిన దొర ఎఱ్ఱన.

వీరు ముగ్గురూ శ్రీ వాణీ గిరిజలను వక్షోముఖాంగాలలో ధరించారు. వక్షము గౌణార్థంలో హృదయమై, నన్నయ ఆయుస్సు పోసినవాడు అవుతున్నాడు. ముఖాన అంటే ఒక పర్వప్రారంభంలో, విరాటపర్వాదిలో ధరిస్తున్నాడు, తిక్కన. అంగములో అంటే అవయవంలో, ఒక భాగంలో ఆరణ్యపర్వభాగంలో, ఎఱ్ఱన ధరిస్తున్నాడు. ఈ మహార్థము నన్నయవాక్యములో పుట్టి ఫలించడమువల్ల నన్నయ ఋషిత్వాన్ని సూచిస్తున్నది.

‘వక్షోముఖాఙ్గేషు’ అనేచోట అవయవద్వంద్వానికి బహువచనము ఉంచడము దోషం అనుకోవచ్చు. ఇక్కడి భిన్నావయవములు ఏకపురుషావయవాలు కావు. సమాసాంత విధులకు అనిత్యత్వము ఉన్నది. అంతేకాకుండా, అనుద్దిష్టమైన భావికాలంలో పరిణామమాత్ర ప్రతిఫలితార్థాన్ని స్ఫురింపజేసే శ్లేషపర్యవసానముకోసము ఋషివాక్యములోనుంచి బహువచనము బయలు దేరింది. నన్నయ ఋషిత్వానికి ఇది ప్రథమ నిదర్శనము.

△

## నిశి

దివమే
తిరిగిరాని
ఈ-
ప్రవాసి
బ్రతుకులో
ఓ-
ప్రియురాలా !
నిశియే
నిత్యమైనది.

సుఖమయమౌ
సుప్తజీవికకు
చూపుల కందని
ప్రేయసిమధుర
స్మృతులే-
తొలగక
నిలిచి పోయినవి.

మరలిరాని
ఆ పవలునకై
మదియేలా?
తిరిగిపోని
ఈ రాతిరికై
దిగులేలా ?

## నీ-

నీ-
క్రీగంటి
ఒక్కచూపే చాలు
ప్రేయసీ !
నిశితనారాచ
సహస్రమై
నిదురించునాయెడద
నిప్పుకల్ రగుల్చు.

నీ-
విడుచు
ఒక్కనిశ్వాసమే చాలు
నా సఖీ!
రేగుపెన్వాయు
సంకాశమై
మూగిల్లు హృద్వీణ
మ్రోగించివైచు.

నీ-
పలుకు
ఒక్క మృదువాక్కే చాలు
మోహినీ!
మధురసోపేత
గీతీనినాదమై
ఉడికిల్లు నాహృదిని
పొడమించు పులకలన్

**చేబ్రోలు సూరన్న**

# పువ్వుల సింగారం

కా. సూ.

ఎండ ఎండలాగే కాస్తూంది. వాన ఒక్క పావుగంట జల్లుగాకురిసి అప్పుడే వెలిసింది. పువ్వులవాన ఒక్కొక్క చినుకు మల్లిమొగ్గంత మంగలంలాగు కాలిఉన్న నేల పడగానే అది మాయమై పోతూంది. తొలికారు జల్లుకాబట్టి నేలనుంచి సువాసనలు బయలుదేరుతున్నవి. తూర్పున హరివిల్లు విరిచింది. తహ తహ లాడుతూఉన్న జీవరాసులకన్నిటికీ ప్రాణాలు తెప్పరిల్లినవి. ఆవరణలో ఉన్న చెట్లమీద పక్షులు కిలకిల లాడుతున్నవి. కళాశాలగంట గణగణ వాగింది. తేనెపట్టు దగ్గర రొద వంటిది ప్రతి తరగతి గదినుంచిన్నీ పొంగిపొంగివచ్చి అయిదునిమిషాలలో ఆగిపోయింది. మారవలసిన ఉపాధ్యాయులు తమతమ తరగతులలోకి వెళ్లినారు. నాకున్నూ మా లక్ష్మీపతికిన్నీ మధ్యాహ్నం రెండుగంటలూ పనిలేదు. కిందితరగతుల కసరత్తు తనిఖీ నిమిత్తం మా ప్రిన్సిపల్ గారు కళాశాల వెనకనున్న కొండమైదానంమీదికి వెళ్ళినారు. వీరి కచేరీగదికి దక్షిణంగాఉన్న విశాలమైన వరండామూలకి చేరుకున్నాం మేమిద్దరమున్నూ. చుట్టూఉన్న సింగారంచూచి ఆనందించాలని మా కుతూహలం. ఎడంచేతివేపు బోయకొండ నీటిఎండలో తడుస్తూ నిలవబడ్డది. చాపముల్లుమీద బోశిపులి ఆనందించడానికి వచ్చి జీడిమామిడిచెట్టు వంకకొమ్మమీదనుంచి ఇటూ అటూ దుముకుతూంది. వెనకవేపు ఆపుదలచేసిన అడవిచెట్ల ఆకులు పిల్లగాలికి గలగల లాడుతున్నవి. ఆకులమీద నిలవగాఉన్న వానచినుకులు నేలనురాలిన ఎండాకులమీద టప్పు టప్పుమని పడుతూఉంటే వానలేకున్నా కురిసినట్టే వినిపిస్తున్నది. కుడిచేతివేపు రాజుగారి కోటవరకూ వేసినరోడ్డు ఏటవాలుగా పరుగెత్తుతున్నది. ఈ రోడ్డే వంకతిరిగి మాకు ఎదురుగా కొంచెం దూరంపోయి పేదగుడిసెల మధ్యను మాయమైపోయింది. వంకకు వెలపలి అంచుప్రక్కనే మైదానం, గుడిసెన్న గుళ్ళు, ఆంజనేయస్వామి కోవెలాను.

రోడ్డువంకకు లోపలివారను ఒకగుడ్డిది ముందర ఒకగుడ్డ పరుచుకొని కూర్చొన్నది. గుడ్డకు నాలుగువైపులను నాలుగురాళ్ళు ఎత్తుపెట్టి ఉన్నవి. నున్నగాపరచినగుడ్డ మధ్యను రెండు దమ్మిడీలు కనిపిస్తున్నవి.

“కళ్ళులేనికబోదికిదమ్మిడీ ఒకధర్మంచెయ్యండి, అమ్మలో, ధర్మంచెయ్యండి, అక్కలో! మాపిటికి తిండిలేదు. ఒక రాగిదమ్మిడి గుడ్డిదానికి పారెయ్యండి, ధర్మదాతలో” అంటూ అడుగుకుంటూంది గుడ్డిది.

"చూశావా ! నేలచల్లపడడంచేత జీవరాసులన్నీ ఆనందిస్తున్నవి. ప్రకృతిమాత మనోహరస్వరూపాన్ని ధరించి ఆనందమయంగా ఉన్న సమయములో ఈఒక్కజీవుడు మాత్రం కడుపుకోసం ఎంతకష్టపడుతూందో! కన్నులేక పోబట్టికదా! అదేఉంటే ఈ కన్నులపండుగలో ఆకలి దప్పులు మరిచిపోకుండా ఉండగలుగునా!" అంటున్నాడు లక్ష్మీంపతి.

ఇంతట్లో, ఒకచిన్నపిల్ల, అయిదారేళ్లది, పువ్వులపరికిణీ, ఎర్రనిది, మొలకుచుట్టుకొని, రంగులరవిక తొడుక్కొని చేతితో చేతెడు పువ్వులు పట్టుకొని, ఎదురుగుండా ఉన్నరోడ్డుమీదనుంచి నడుచుకుంటూ గుడ్డిదానికి దగ్గర దగ్గరగా గునగునలాడుతూ వచ్చింది. కాలుచడిపోల్చికాబోలు పాపం ఈపేదరాలు కబోది తనమామూలుబొబ్బ ఇంకొకసారి రాదీసింది "కళ్లులేని కబోదికి రాగిదమ్మిడీ ఒక్కధర్మంచెయ్యండీ, అమ్మలో!" అని.

తన పెర అన్న భేదం ఇంకా ఎరగని ఈపసిపాప గుడ్డిదానికి ఎదురుగుండా వచ్చి నిలిచింది. గుడ్డిది "ఒక్క రాగిదమ్మిడీ, అమ్మా!" అని తిరిగీ మొర్రపెట్టి ఆశకొద్దీ తన దోసిలిపట్టింది. కబోదిదీనస్థితికి ఈచిన్నబిడ్డమనస్సు కరిగింది.

"గుడ్డిదానా! ఎందుకు ఏడుస్తున్నావు? ఇప్పుడు నీకు దమ్మిడీ ఎందుకు? అది నాదగ్గర లేదు. ఆంజనేయులుకోసం కానీపెట్టి కొన్నాను ఇవి; ఇదిగో, పువ్వుతీసుకో" అని తన చేతులో పువ్వులు దానిదోసిట్లో వేసింది బిడ్డ.

చేతిలోపడ్డ వింతవస్తువు తడివిచూచుకొన్నది, ఆపేదరాలు, గుడ్డిది. పువ్వులని పోల్చుకోగానే వాటిని తటాలున తనతలలో ముడుచుకొని, "మాయమ్మా, మాతల్లి, నీ ఇల్లు వేయిళ్లుమొదలు గావాల! నీ కడుపు కండపెరుడు గావాలి! నీ పసుపు కుంకం చల్లగుండాలి" అనిదీవించింది, ఆబిడ్డను కబోది.

తనఇల్లు వెయ్యిళ్లుకావడంమాటగాని, కడుపుపండడంమాటగాని,పసుపుకుంకం చల్లగా ఉండడంమాటగాని ఆబిడ్డకు తెలియనే తెలియవు. గుడ్డిదానితలలో పువ్వులునవ్వినవి. గుడ్డిదానిమనస్సునవ్వింది; ఈరెండూ నవ్వడంచూచి బిడ్డకూడానవ్వింది. ఇతరులునవ్వుతున్నప్పుడు వాళ్లతోకలిసి నవ్వడానికి బిడ్డలకే తగును.

"గుడ్డిదానికి పువ్వులసింగారంకూడాను" అన్నాడు మాలక్ష్మీంపతి.

ప్రకృతిమాతను తనబిడ్డలకు సంతోషపెట్టడానికి లెక్కలేని మార్గాలున్నవి; అందులో ఇదొకటి. పుట్టుగుడ్డిఅయితేనేమి పూర్వజన్మలవాసన ఎక్కడకుపోతుంది"అన్నానునేను.

△

# త్రపావతి

రాపూరి సత్యనారాయణరావు

ముసుగు లెత్తు త్రపాభరమ్మున నను పవన
చాలిత శ్రావణాంబుద సరణి రమణి
పోవ నేటికి; యౌవన జీవితాంబ
రమ్ము వెలిగింపు నిలిచి తారకవిధాన.

తరలు తెలిమబ్బుటంచు జల్తారు కొసల
వలె పరువు లెత్తు పచ్చివెన్నెల చలాకి
సాగ వల దోసి ప్రేయసీ ! జారిపోవు
జిలుగు పయ్యెద నాయెద చెదరగొట్టు.

ఈగులాబులు విచ్చి నాయెడద లోతు
తొంగి చూచుచున్నవి తావి తొణికి పోవ,
నీ వలపు మోవిరేకుల భావ ముంచి
తిరిగి చూడని గుండె నిబ్బరము నరయ.

పిలుచు చున్నానె ! సెలయేటి మలుపులందు
మావి చిగురాకు మేత సుమాళి మొలయు
కొంటె కోయిల పడుచుతో గొంతు కలిపి
పాడు కొందము ప్రేయసీ ప్రణయగీతి.

చెంగునను దాటు ముగ్ధసారంగకన్య
పంట మెలివడ్డ సుమవల్లి పగిది నీ క
టాక్షముల జిక్కువడ్డ నవ్యానురాగ
మలతిగా నెంచి త్రెంపుచో వలదు సకియ !

౭౯

# గ్రంథ సమీక్ష

## రాజసూయ రహస్యము

(26 + 110 పుటలు. వెల రూపాయి)

పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, పిఠాపురము.

కట్టమంచి రామలింగారెడ్డిగారు ఇంగ్లీషుభాషలో దీనికి చక్కని పీఠిక వ్రాసినారు. రెడ్డిగారు మహాభారతం బాగా అవలోకన చేసినవారనీ, విమర్శవాస్త్రాగనీ, ప్రతీతి. మాకు తెలిసినంతలో రెడ్డిగారు మదరాసు గోక్లేహాలులో మహాభారతమునుగురించి ఉపన్యాసం ఇచ్చారు. తర్వాత రాజమహేంద్రవరములో వార్షికోత్సవ సందర్భంలో అధ్యక్షతవహించి మహాభారతం—నన్నయభట్టులను గురించిఅభిభాషణము చెప్పినారు. వారి మహాభారతవిమర్శ అచిరకాలములో చూడవలెనని అస్మదాదుల అభిలాష. అసలు ఈపుస్తకము సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించడానికి కారణము రామలింగారెడ్డిగారే. 1936 లో శాస్త్రిగారు రెడ్డిగారిని చిత్తూరులో కలుసుకొని సంభాషించినప్పుడు రాజసూయ రహస్యాన్ని గురించి రెడ్డిగారు కొన్నిసూచనలు ఇచ్చినారట. వారు చెప్పిన అనువిషయాలను శాస్త్రిగారు ఉదాహరణప్రాయముగా ఈ గ్రంథం చేసినట్టు పీఠికవల్ల తెలుస్తున్నది. అయితే శాస్త్రిగారికి రెడ్డిగారికి కొద్ది విషయాలలో మతభేదము ఉన్నది.

ఈగ్రంథరచనలో సుబ్రహ్మణ్య శాస్త్రిగారి అపారపాండిత్యము విశదము అవుతున్నది. వారు వేద సంహితలు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, పురాణేతిహాసములు మొదలైన వాటిలోనుంచి ప్రమాణములు ఉద్ధరించినారు. రచనలో స్వతంత్రత లేకపోలేదు.

మనదేశంలో ముందు ఏది ప్రచారంలోకి వస్తే అదేప్రశస్తం అని ప్రజలవిశ్వాసం. మొదటినమ్మకానికి విరుద్ధంగా న్యాయ్యమైనసంగతులు విద్వాంసులు వివరించి చూపినప్పటికి అంగీకారం కాదు. పైగా అటువంటి విద్వాంసుల్ని బహువిధాల దూషిస్తారు. మతానికి, ధర్మానికి, వాఙ్మయానికి అనర్థం వచ్చినట్టు ఆందోళన చేస్తారు. శాస్త్రిగారు కొన్ని సంవత్సరాలకిందట మహాభారతచరిత్ర రచిస్తే అనేకమంది శ్రోత్రియులు వారిని ఎంతో దూషించి చిక్కులపాలు చేశారు. వారు ధీరులు కాబట్టి వెను దీయక మళ్ళీ భారతవిషయమే ఇంకొకటి ఈగ్రంథరూపకంగా ప్రకటించారు. కావలసిందిన్యాయం. సామాన్యంగా విద్వాంసులకు విశాలదృష్టి మానేసింది. సక్రమమైన విమర్శ లేకుండా వేళ్లు పాతుకు పోయిన శరిభావాలను పెకలించడం మహాకష్టం. మహాభారతాన్నిగురించి జనసామాన్యానికి వింత భావాలు ఉన్నవి. విద్వాంసులకుకూడా వ్యాసమహర్షి గ్రంథం రాసినట్లు విశ్వాసం. వ్యాసుడనేది బిరుదు. వ్యాసులు 28 మంది ఉన్నారు. కృష్ణద్వైపాయనుడికి కూడా వ్యాస ఉపాధిఉన్నది. ఆయన రచించినది జయ గ్రంథం. కురుక్షేత్రయుద్ధానంతరం బదరికాశ్రమంలో మూడుసంవత్సరములు ఉండి గ్రంథం 8800 అనుష్టుప్పులలో ముగించినాడు. ఉపాఖ్యానములు కొన్ని చేర్చి 24 వేల గ్రంథం వైశంపాయనుడు యుద్ధం తరువాత నూరేండ్లకు పెంచాడు. తర్వాత కొంతకాలానికి "సౌతి" లక్ష శ్లోకాలగ్రంథం చేశాడు. అనామకులు అనేకులు ఏవోగాథలు గ్రంథంలో ఇరికించారు. శతసాహస్రిక సంహిత అని ప్రసిద్ధిఉన్నా, ఉపలభ్యమానగ్రంథంలో ఇంకా కొన్నివేలు ఎక్కువ

శ్లోకాలు కనపడుతున్నవి. ఆదిలో జయము, తర్వాత భారతము, చివరకు మహాభారతంఅని ప్రసిద్ధి వచ్చింది.

"భారతః పంచమో వేదః" అని సూక్తిగదా! వేదములో ఉన్నట్టే దీనిలోకూడ సమానాంశములు కొన్ని ఉండడంచేతనే ఆసంజ్ఞ వచ్చింది. వేదంలో విధి, మంత్ర, అర్థవాద ఉంటవి. ఐహికఆముష్మిక సుఖాలు పొందటానికి చేసేయజ్ఞాదులు విధులు. దేవ, మనుష్య, పితృ దేవతాకముగా ఉంటవి యజ్ఞములు. గోమేధ, అశ్వమేధ, రాజసూయాదులు దేవయాగాలు. తటాక ప్రతిష్ఠాదులు, దానాలు మనుష్యయజ్ఞాలు. శ్రాద్ధాదులు పితృయజ్ఞాలు. మహాభారతంలో సర్పయాగ, వైష్ణవయాగాదు లున్నవి. వేదములో ఉపనిషత్తు లున్నట్టు ఇందులోనూ భగవద్గీతలు, సనత్సుజాతీయ అను గీతాదులు ఉన్నవి. మంత్రద్రష్టలు, కాండర్షులు, పృథక్సంహితలు వేదముల కున్నట్లు దీనికీ ఉన్నవి. దీనికి కార్ష్ణివేదమని వైయాసికీ సంహిత అనిపేర్లు. సుమంత, జైమిని, పైల, శుక, వైశంపాయననామకము లైనపృథక్సంహితలు ఉండేవి. జైమిని సంహితలో మిగిలినభాగం అశ్వమేధపర్వం. వేదాలకు ఖిలసంహిత లున్నట్లె మహాభారతానికి హరివంశం ఖిలం.

ఉదంకుని నాగస్తుతి, ఉపమన్యుని అశ్వనీస్తుతి, మందపాలపుత్రుని అగ్నిస్తుతి, కుంతీకర్ణరాజాల సూర్యస్తుతి, అర్జున మునుల రుద్రస్తుతి, భీష్ముల శ్రీకృష్ణస్తుతి సూక్తప్రాయములు. ఇంతేకాకుండా వేదంలో మంత్రాలు స్వల్పభేదంతో కొన్ని ఛందోబద్ధ మైనవి ఇందులో ఉన్నవి. లౌకికభాషలో ఉన్నప్పటికీ, పై కారణాల చేత మహాభారతానికి వేదసంజ్ఞ వచ్చి పవిత్రత ఏర్పడ్డది.

ద్విజాలు యజ్ఞాలు చెయ్యాలి. 'రాజా రాజసూయేన యజేత' అనిశ్రుతి. ఈ విధివాక్యమువల్ల క్షత్రియులకే రాజసూయార్హత ఉన్నది. రాజసూయ యాగమున సోమలతాఖండనము చేసి, పునరభిషేకానికి పూర్వము ఉదవసానీయేష్టిలో రాజు క్షత్రియుని ఒకణ్ణి పశువుగా బంధించాలి. సాధువుగాక రణవీరునే జయించి తీరాలి. అతన్ని బంధించవచ్చు.

ప్రాచీనకాలములో నరమేధం బాగా ప్రచారంలో ఉండేది. దేవతలకోసం మనుష్యులను వికసించవచ్చు అనిచాలామంది అంగీకరించిన విషయమే! ఇప్పటికీ రహస్యంగా నరబలులు జరుగుతూనే ఉన్నవని వార్తలు తెలుస్తూ ఉంటవి. ఇలా బలి ఇవ్వడంవల్ల పుణ్యం కలుగుతుందని భ్రమ.

రాజసూయం చాలా ఘోరమైనకర్మ. క్రమంగా క్షత్రియవిశస్యం మానివేసి అశ్వాన్ని బంధించే వారు. అశ్వమేధము ప్రచారంలోకి వచ్చింది. రాజసూయ యాగోద్దేశము తత్కర్తకు సార్వభౌమత్వ మాపాదించడమే. అప్రభువు పశుపతి అయినాడనీ, తక్కినరాజులు పశువులు (వధ్యులు) అనీ తేలిపోతుంది.

యుధిష్ఠిరుని రాజసూయయాగములో శిశుపాలుడు పశువు అయినాడు! చేదిదేశరాజు కృష్ణపాండవులకు బంధువు అయిన శిశుపాలుడు యోగ్యుడుఅని చెప్పడం కష్టం. కాని అతన్ని మోసంచేసి సంహరించారు. అతనికి మోసంసంగతి తెలిసి ఉంటే యజ్ఞవేదిక దగ్గరికి వెళ్లేవాడు కాదు; వీలయితే ఎదురుతిరిగి యుద్ధంచేసి ప్రాణాలు విడిచే వాడేమో. కొన్ని భారతప్రతులలో అతను యుద్ధము చేసి చనిపోయినట్టు ఉన్నదట. శిశుపాలవధ కావ్యములో కూడా అలాగే ఉన్నది. సాల్వుని వాక్యమువల్ల కృష్ణుడు, శిశుపాలుని హఠాత్తుగా చంపినట్టు స్పష్టము.

"భ్రాతా, బాలశ్చ, రాజాచ, నచ సంగ్రామ మూర్ధని ప్రమత్తాశ్చ హతోవీర, త్వం హనిష్యే జనార్దనమ్."

ధర్మరాజు, శిశుపాలుని వెంటనే సత్కారంతో సంస్కరించ వలసిందని ఆజ్ఞ ఇస్తే, అతని తమ్ములు అలా చేసారు. అతనికుమారుడు అక్కడే ఉన్నప్పటికీ ధర్మరాజునిసోదరులే శిశుపాలుని యజ్ఞ పశువుగా సంస్కరించారు.

హరిశ్చంద్రుడు, ధర్మరాజు మాత్రమే రాజసూయము చేశారని పౌరాణికులు తలుస్తారు. పదిమంది యితరరాజులుకూడా రాజసూయము చేసినట్టు తెలుస్తుంది.

ధరణి హరిశ్చంద్రుడు భాసుర యశుడయి చేసె రాజసూయం బదియున్
సరిగాదనియే తలఁతును సురుచిరవిభవమున పాండుసుతుయజ్ఞముతోన్.

అవును! హరిశ్చంద్రుడు మాట యిచ్చినప్రకారం తనకుమారుడు లోహితుణ్ణి యజ్ఞపశువును చెయ్యక కొనితెచ్చుకున్న శునశ్శేపుని బంధించాడు. చివరకు ఆవిప్రబాలుణ్ణి విశసనం చెయ్యడం పడనేలేదు. ధర్మరాజునికో మూర్ధాభిషిక్తుడైన రాజే యజ్ఞపశువు అయినాడు. ఇతని రాజసూయం గొప్పదికాదూ!

△

## భ గ వ ద్గీ త

౩౮ + ౫౩౭ + ౧౮ పుటలు: [illegible] రూపాయి

ఆంధ్రపత్రికా కార్యాలయము, మదరాసు.

శ్రీ నాగేశ్వరరావు పంతులుగారిచే ప్రకటితము. ఆంధ్ర గ్రంథమాలలో అంతర్భూతము. పురాణం సూర్యనారాయణ తీర్థులు గారిచే పరిష్కృతము. చక్కని కాగితము, అచ్చు, ఖాదీ బైండింగు. ఇంత రమణీయ ముద్రణముతో, ఈ మహోత్తమ గ్రంథము ఇంత చౌకగా ఇవ్వడము ఆంధ్రపత్రికాధిపతులకే చెల్లింది!

ఉపోద్ఘాతమూ, భీష్మకృత శ్రీకృష్ణస్తుతి (తెలుగు) గీతామాహాత్మ్యము, ఋష్యాదిన్యాసములు ఉన్నవి. ఈ గ్రంథము సక్రమ పారాయణ చేయడానికి అనుకూలము.

నాగేశ్వరరావు పంతులుగారు భగవద్గీతమీద ఉన్న అన్ని వ్యాఖ్యలూ, విమర్శలూ చదివారని ప్రతీతి, ఉపోద్ఘాతము ౧౮ పుటలతో ఆగిపోయింది. వారు లింగైక్యము పొందకుండా ఉన్నట్టయితే ఉపోద్ఘాతము గొప్ప గ్రంథంగా పరిణమించి, వారి అశేషపాండిత్యానికి, ప్రమాణ భూతముగా ఉండేది. ఇంతకూ శివాజ్ఞ మరోవిధం అయింది!

పంతులుగారు కారాగారములో ఉన్నరోజుల్లో టీకా, తాత్పర్య, విశేషార్థాలు వ్రాసి, గీత పూర్తి చేశారు. ప్రతి అధ్యాయ ప్రారంభంలోనూ, ముఖ్యమైన ఘట్టాలముందూ విశదమైన అవతారికలు వ్రాసి, విషయప్రవేశము సుబోధం చేశారు విశేషాలలో అక్కడక్కడ, శంకర, రామానుజ, మధ్వాచార్యుల మతాలూ తిలకు మొదలైన మహావిద్వాంసుల అభిప్రాయాలు సూచించారు. ప్రక్షిప్త శ్లోక సూచన కూడా వచ్చింది.

శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి వ్యాపారదక్షతలో, పత్రికా నిర్వహణంలో, దాతృత్వంలో, ధర్మబుద్ధిలో దాగుడు పడ్డది పాండిత్యం! వారు విద్వాంసులు అనేసంగతి విజ్ఞులకే విశదము.

# మొయిలు రాయబారము

( పద్యకావ్యము : వెల 0-8-0 )

చర్ల గణపతిశాస్త్రి, నిడదవోలు.

కాళిదాసవిరచిత మయిన మేఘదూతకు ఇది అనువాదము. అచ్చతెనుగుమీద అభిమానంచేత గ్రంథకర్త తెలుగుపేరు పెట్టినాడని తోస్తుంది.

సంస్కృతములో కాళిదాసు మేఘదూతము రచించిన తరువాత ఇతరకవులు దూతకావ్యాలు రాశారు. ఆయన మందాక్రాంతవృత్తం అవలంబించడము చేత ఇతర దూతకావ్యరచయితలు కూడా మందాక్రాంతమే ఆశ్రయించారు. హంససందేశము, పవనదూతము, పదాంకదూతము, మానససందేశము మొదలయిన కావ్యాలన్నింటిలో అదే వృత్తము. కాళిదాసు కవిత్వంమీది ఆదరంచేత అలా చేశారు కవులు. మందాక్రాంతలో కాళిదాసు, శిఖరిణిలో ఆచార్యశంకరులు, వంశస్థంలో మాఘుడు, శార్దూల విక్రీడితములో రాజశేఖరుడు సిద్ధహస్తు లని విద్వద్విదితము.

జూన్ 16 తారీఖున కలకత్తాలో "మేఘదూత ఉత్సవము" కాళిదాససమితివారి యాజమాన్యమున జరిగింది. సమితిస్థాపకు లయిన మన్మథనాథ భట్టాచార్యులు మేఘదూతచరిత్ర వివరిస్తూ వింతసంగతులు చెప్పినాడు.

"1368 సం॥ క్రిందట కాళిదాసును సర్గుజా సంస్థానంలో వున్న రామగిరికి పంపివేశారట. కవి 8 మాసములు ఏకాంతముగా కాలము గడిపాడట. ఆకాలంలో ఆయనభార్య హిమాలయదక్షిణ పార్శ్వములో వున్న అలకానగరంలో నివాసము చేస్తున్నదట. ఆషాఢమాస ప్రథమదివసమున మేఘము కనబడేసరికి ప్రియురాలు జ్ఞాపకం వచ్చిందట. అప్పుడు మేఘదూతం రచించినాడట. తరువాత నెలరోజులకు కవిని వదలిపెట్టినారట."

వింటుంటే వింతగానే వుంది. దీనికి తగిన ప్రమాణాలు ఆయన చూపలేదు. రమారమి 70 సంవత్సరముల కిందట డాక్టరు భాఊదాజీ మహాశయుడు కాళిదాసుమహాకవి భార్యపేరు పద్మావతీదేవి అని ప్రకటించాడు. ఎక్కడ లభ్య మయిం దని విద్వాంసులు ఏకగ్రీవంగా అడిగేసరికి డాక్టరు మౌనము అవలంబించాడు. నిజానికి కాళిదాసకవిసంగతు లేవీ తెలియవు. ఏసంవత్సరాలలో జీవించియున్నాడో కూడా కచ్చితంగా ఇంతవరకు తేలలేదు.

ఒకటి కావచ్చు. ఏకారణంచేత నయినా కాళిదాసుకు ప్రియావియోగం కొంతకాలం కలిగివుండవచ్చు. కోమలహృదయు డయినకవి స్వానుభవమే కావ్యంగా అల్లవచ్చు! లేదా ఏమిత్రుల అనుభవమో విని ఈకావ్యం రాసివుండవచ్చు.

రాముడు హనుమంతునిచేత సీతకు సందేశము పంపినకథ మనసులో పెట్టుకొని కవి ఈ దూతకావ్యం రచించినా డని మల్లినాథసూరి వ్యాఖ్యానంలో అన్నాడు. కావచ్చు, కాకపోవచ్చు. ఈకథావిధానానికి దాత్యరీతి తగిన దని అందరూ అంగీకరించారు.

దూతకావ్యాలలో విప్రలంభమే కథావస్తువు. సంయోగంకంటె వియోగమే స్వారస్యానికి ఉనికిపట్టు. సిద్ధికన్న సాధనే చమత్కారప్రదము. చివరకు మానస సందేశంవంటి వేదాంత విషయిక మయిన దూతకావ్యంలోకూడా వియోగమే వర్ణించివున్నది.

కాళిదాసు దిఙ్నాగాచార్యులకు సమకాలికుడనీ, నిచోళకవికి మిత్రుడనీ ఐతిహ్యమున్నది. ఇది ఎంతవరకు వాస్తవమో చెప్పలేము. కాళిదాసు క్రీస్తుకు పూర్వమువాడయినా, క్రీస్తు తరువాత నాలుగు శతాబ్దులవాడయినా, సమకాలికత్వం కుదరదు. దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్ అనే పంక్తిలోనుంచి ఈ సంఘటన పైకిలాగారు కొందరు. కుందమాల నాటకకర్త అయిన ఆచార్యులు కాళిదాసును అధిక్షేపించవలసిన అవసరమేమో కనిపించటం లేదు. దిఙ్నాగుడు గొప్ప నైయ్యాయికుడే, కాళిదాసు కవిత్వం ఎక్కడా వేసబబుగా వుండదు. మరి వివాదమెందుకో!

కాళిదాసు దేశం ఎక్కువగా చూసివుంటాడు. కావ్యాన్నిబట్టి మేఘుని మార్గం ఇలా కనపడుతుంది:- చిత్రకూట, మాల, ఆమ్రకూట, రేవా, దశార్ణ, విదిశా, వేత్రవతీ, నీచైర్గిరి, నిర్వింధ్యా, అవంతీ, విశాలా, గంభీరా, దేవగిరి, చర్మణ్వతీ, దశపుర, బ్రహ్మావర్త, కురుక్షేత్ర, సరస్వతీ, కనఖల, గంగా, హిమవత్, శ్రీచరణన్యాస, క్రౌంచరంధ్ర, కైలాస, మానస, అలకానగరములు. రామగిరి యెక్కడున్నదో ఇంకా నిర్ధారణ కాలేదు. అలక హిమవత్పర్వతాలకు దక్షిణంగా వున్నదని బెంగాలీ విద్వాంసుడు అంటున్నాడు!

మేఘదూతానికి అనేకమంది ఆంధ్రానువాదాలు చేశారు. అందరూ పద్యానికి పద్యప్రకారం తెలుగు రాశారు. గణపతిశాస్త్రిగారు అలా చేయకుండా కొంత స్వతంత్రించి మూలంకంటె ఎక్కువ పద్యాలలో అనువదించారు. పద్యానికి పద్యం చెయ్యటంలో శిల్పం ఎక్కువ కావాలి. ఈ పద్ధతిలో భావవివరణానికి ఎక్కువ అవకాశం వుంది. ఒకరికొకటి నచ్చుతుంది.

నీవు సగమ్ము వంగి సురనిమ్నగలో స్ఫటికాచ్ఛనీర మై
రావతమట్లు గ్రోలగ దలంచిన దృక్ప్రతిబింబమూర్తితో
భావహామై ప్రవాహమున నల్లన నల్లన లోని వేగ స్రో
తోవహ పొల్చెడున్ యమునతోడుత సంగమ మొందెనో యనన్.

గణపతిశాస్త్రిగారి వృత్తాలు బాగా నడిచినవి. ధార చాలా మంచిది. అయితే కొన్ని తేటగీతలకు ఐదు పంక్తులు ఉండటం బాగా లేదు. తెలుగులో పద్యం నాలుగు పాదాల్లో ముగియటం సాగును. ఇక 'స్వాగతం ఓకు నెమిళ్ళ, తెల్యంజేయు' మొదలయినవి రుచిగా లేవు.

గణపతిశాస్త్రిగారు విద్వత్కుటుంబములో వారు. సుప్రసిద్ధులయిన తమ తండ్రి చర్ల నారాయణశాస్త్రిగారికి నమస్కారంచేసి ఈ కావ్యం తెలిగించారు. అనేకులు ఈ కావ్యం మథించి ఆంధ్రీకరించినప్పటికీ కాళిదాస కవీంద్రుని వాగమృతము ఆస్వాదించి ఆతీయదనాన్ని తెలుగులోకి తేవాలనే సాహసంవల్ల రాశారు.

ఈ కృతిని శాస్త్రిగారు, 'ప్రణయిని సుశీలకు' అంకితం చెయ్యటం చాలా సరసంగా వుంది! హృదయవాదులయిన కవులు నిజకాంతల విషయంలో ఆదరం చూపటం అర్హమే!

త. శి. శా

Δ

## గాంధీ చరిత్ర - సిద్ధాంతములు.

కొమాండూరి శఠకోపాచార్యులు, కాకినాడ.

ఆచార్యులుగారు ఆంధ్రభాషకూ, ఆంధ్రసంఘానికీ మంచి సేవ చేస్తున్నారు. ఇదివరలో వారు జగత్కథ, శివాజీ చరిత్ర, సుభాష్ బోస్ చరిత్ర మొదలైన ఉపయుక్త గ్రంథాలు వ్రాసి, తక్కువ వెలతో అందరికీ అందుబాటు చేశారు.

"గాంధీ చరిత్రము - సిద్ధాంతములు" చాలా అవసరమైన గ్రంథం. యుగపురుషుడు మహాత్ముని గురించి ఇదివరలో తెలుగులో వెలువడిన గ్రంథాలు ఇంత up-to-date గా లేవు. 1921 సంవత్సరం వరకూ మహాత్ముని చరిత్ర వీరు 64 పుటలలో ఇమిడ్చి, తరువాతి చరిత్ర, సిద్ధాంతాలూ విపులంగా 136 పుటలలో వ్రాశారు. చివర, ముఖ్యవిషయముల కాలసూచిక కూడా చేర్చారు. మహాత్ముని తత్వమూ, మహత్వమూ తెలుసుకోవాలంటే ఈ గ్రంథం ఎంతో సాయపడుతుంది.

ఇలాంటి వెన్నో ఆచార్యులుగారు వ్రాస్తారని ఆశిస్తున్నాము. వారి దృష్టి ఇంకా వ్యావహారిక భాషమీదికి పోనందుకు చింతిస్తున్నాము.

శ. రా

△

## కవుగిలి

( 1 పరిమాణంలో అందంగా అచ్చుపడ్డ కావ్యం : వెల 0-3-0 )

కర్తలు : కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి
కూచిపూడి గ్రామం: తెనాలి తాలూకా: గుంటూరు జిల్లా.

'హెర్మిట్' అనే ఇంగ్లీషు కావ్యానికి స్వేచ్ఛానువాదం. కావ్యం అంతా ద్విపదలో నడిచింది. భారతీయ సంప్రదాయానికి అనుగుణంగా భావాలు కూర్చినారు. కవులు జంటలు విడిచి, అద్వైతసిద్ధి పొందడం యుక్తం. 'కవుగిలి' అనే పేరు కమ్మగా ఉన్నది! నాయికా నాయకుల ప్రణయానికి పరమావధి 'కవుగిలి' కదా!

శ. రా.

△

## హిందువుల పండుగలు

( పుటలు 310 : వెల రూపాయి )

సరవరము ప్రతాపరెడ్డి, గోల్కొండ ముద్రాక్షరశాల : తూప్రు బజారు - హైదరాబాదు (దక్కను)

సామాన్యంగా మన మంతా పండుగలకోసం ఎదురుచూస్తూనే వుంటాము. వాటిప్రాముఖ్యం మాత్రము జనబాహుళ్యానికి ఎక్కువగా తెలియదు. ఏదేనా ప్రయోజనం తెలుసుకొని ఆచరించటం సబబు.

ఈవిషయాన్ని గురించి ప్రతాపరెడ్డిగారి కృషి ఫలితంగా బహుజనాదరణీయ మయిన ఈగ్రంథం బయలువెడలింది. పండుగలు లెక్కించటం మొదలుపెడితే ప్రతిరోజూ, ప్రతితిథీ పండగ లెక్కలోకే

వస్తుంది. అందరికీ ముఖ్యమయిన పండగలు కొన్ని మాత్రం వుంటాయి. అవన్నీ ఎందుకు పర్వదినాలుగా పూర్వులు ఏర్పరచారో తెలుసుకోవా లంటే ప్రతాపరెడ్డిగారి గ్రంథం బాగా వుపయోగపడుతుంది.

ఈ గ్రంథానికి పీఠిక రాధాకృష్ణన్‌గారు రాశారు. అలాంటిసమర్థులు ఈగ్రంథాన్ని బహుధా ప్రశంసించటంవల్ల ప్రాశస్త్యాన్ని గురించి వేరే చెప్పనవసరం ఉండదు. గ్రంథకర్త తనపీఠికలో మొదటి ప్రచురణమీద వచ్చిన అభిప్రాయాల్ని కూడా ఇందులో చేర్చారు. అభిప్రాయ ప్రదాతలు వారికి తోచింది వారు రాశారు. గ్రంథం ప్రయోజనం వారు అంగీకరించారు. గ్రంథకర్తవ్యాఖ్యానాలు మాత్రం వారికి అనవసర మని తోచింది.

ఇందులో షుమారు 60 పండగలు వ్రతాలని గురించి వ్రాశారు. గ్రంథకర్త తన అనుభవాన్ని, బహుగ్రంథ పరిచయాన్ని ఆధారంచేసుకొని అక్కడక్కడ వ్యాఖ్యానం చేయటం ఉచితమే నని మాకు తోస్తోంది. అలాంటి వ్యాఖ్యలే లేకపోతే ఈ గ్రంథానికీ స్త్రీల వ్రతకథలు మొదలయిన సామాన్య గ్రంథాలకీ ఏమీ తేడా వుండేది కాదు. కర్త ముఖ్యోద్దేశం నెరవేరేది కాదు.

ఈ గ్రంథంమీద వచ్చేరాబడి గోల్కొండ పత్రికకు విరాళం చెయ్యటం గ్రంథకర్త ఔదార్యాన్ని వ్యక్తపరుస్తోంది.

రా. సు.

△

## జానకి ప్రేమ (మొదలయిన) చిన్నకథలు.

( 184 పేజీలు : వెల 0-5-0 )

కర్త: ఉటుమల్లి కామేశ్వర రావు

ప్రకాశకులు: ఉటుమల్లి విశ్వనాథం, రాజమహేంద్రవరం.

ఆంధ్రభూమి, కళ, ఢంకా, వినోదిని, యువ, మొదలయిన పత్రికల్లో అప్పుడప్పుడు ప్రకటించిన తమ పది చిన్నకథలను చేర్చి గ్రంథకర్త పుస్తకరూపంగా ప్రకటన కిచ్చారు. కథలన్నీ సరళమయిన వ్యావహారికభాషలోనే వున్నాయి. వడ్డాది అప్పారావుగారు తొలిపలుకు రాశారు. గిడుగు రామమూర్తిపంతులుగారికి ఈగ్రంథం అంకితమైంది.

ఈకథలు కాలక్షేపానికి బాగా పనికివస్తాయి. మొదట వినోదిని, ఢంకాలాంటి పత్రికల్లో ప్రకటించటానికి రాశారు, కనుక ఇవి కేవలం వినోదానికే వుపయోగపడతా యని తోస్తుంది. మానవస్వభావాన్ని చిత్రించటానికి అక్కడక్కడ గ్రంథకర్త చేసినప్రయత్నం కనపడుతూనే వుంది. కథ కల్పించిందే కదా అని కథకులు సామాన్యంగా స్వభావవిరుద్ధ మయినఘట్టాలు కల్పించి రసాభాసం చేస్తారు. ఈగ్రంథకర్త కల్పించినపాత్రలు స్వభావవిరుద్ధంగా లేవు. పార్వతీబాయికథ మాత్రం కొద్దిగా పట్టిస్తోంది. పత్రికల్లో అచ్చుపడ్డబొమ్మను చూచి మోహించి కృష్ణమూర్తి ఆవిడకోసం పూర్ళమీద పడటం పార్వతీబాయి కృష్ణమూర్తుల ప్రణయచర్యలు కాస్త వింతగా వున్నా యని తోస్తుంది.

కృష్ణమూర్తి ఆమె ఫోటోను చూసి విస్మితుడై, మనిషిని చూసి విరక్తి చెందాడు. ఆవిడప్రవర్తన మళ్ళీ అతన్ని పరవశుణ్ణి చేసింది. ఇలా కొంత అటూ ఇటూగా నడిచింది. ఈకథ. ఇంకా కొన్ని కథలు ఈమాదిరిగానే వున్నాయి.

ఇందులో శైలి సరళంగానే వుంది. కాని తెలిపలుకులో Standard వ్యావహారికం ఇదే నని చెప్పటం చాలా సాహసం. భాష Standardise కావటానికి ఇంకా కాలం పడుతుంది. బహుశా మనతరం వెళ్ళిపోవాలేమో.

నెల్లూరుజిల్లాకు సంబంధించిన పాత్రలు మాట్లాడుతోన్నట్టు చెపుతూ 'ఏండే, ఏండే' అని చాలా మాట్లు అనిపించారు; ఇది శ్రుతికటువుగా వుంది. తూర్పుగోదావరి జిల్లావారు దొబ్బేశేశారని చులాగ్గా అంటూవుంటారు. ఇతరజిల్లలవాళ్ళకి అప్రయోగం అశ్లీలంగా గోచరిస్తుంది. అలాంటి ప్రయోగాలజోలికి తొందరపడి పోగూడదు.

కథలు అందరూ చదువదగినట్టుగా బాగున్నాయి. గ్రంథకర్త తనకథలని ఇతరులు అనుకరించారని విచారిస్తోన్నట్టు తోస్తుంది. అనుకరించకపోతే మనం ఆంధ్రులం ఎలా అవుతాం ! రా. సు.

Δ

## నవకవి

కర్త: బుద్ధవరపు నాగరాజు, బి. ఏ., పిఠాపురం

చక్రాని అచ్చులో ప్రచురింపబడిన ఏకాంక నాటిక. వెల: 0-6-0.

రామం నవకవి; మణిని ఆశించి ఆమెను ప్రేమించినట్టు చెప్పి, "ఇప్పు డాయన్ని (మణిభర్తను) అడిగేస్తాను, నిన్ను నా కిచ్చెయ్యమని; మనం అన్యోన్యం ప్రేమించుకుంటున్నప్పుడు ఆయ నెవడు ఇంకా నిన్ను తన దగ్గర దాచుకోడానికి" అని కోసి, తీరా ఆయన వచ్చి అడిగితే తాను మణిని ప్రేమించడం లేద నేశాడు.

మణి విద్యావతి; తాను 'ఏనవనాగరక పాశ్చాత్యదేశంలోనో ఎందుకు పుట్టేను కాదా అని ఎన్నో సార్లనుకుంటూ' రామాన్ని చూసి "ఆయన (తనభర్త) అంటే నాకిష్టం, ఆయనకి నేనే కావా లంటున్నారు గనుక; నువ్వన్నా నా కిష్టమే, నాకు నువ్వుకావాలి గనక. ఇద్దర్నీ ప్రేమిస్తున్నా" నంటూచెప్పి, రామం బెదిరి పారిపోయాక అతని మాటేనా తలవకుండా హాయిగా హార్మోనియం వాయించుకుంటుంది.

పరశు ప్రపంచపు మనిషి; మణి సంగతీ, రామం సంగతీ పూర్తిగా తెలుసుకునీ కూడా "నాభార్యను నువ్వు ప్రేమించవూ ? ప్రేమించలేవూ ? ఓరి స్కౌండ్రల్ !"అని దబాయించి రామానికి బుద్ధి చెపుతాడు.

ఇలాటి విచిత్ర ప్రకృతుల్ని ముగ్గుర్నీ సమావేశపరిచి చక్కగా నాటకం ఆడించారు, నాగరాజుగారు. "ఈ కథలో ఒక నీతి చెప్పాలని కాదు, నా అభిప్రాయం. ...ఒక విధమైన యువక జీవితంలో ఒకవైపు చూపిద్దామని" అని కవే చివర నంటాడు.

ఈ నాటికలో భాష చక్కని వ్యావహారికం; భావాలు లోతైనవి; సంభాషణ చురుగ్గా ఉంది; పాత్ర పోషణకూడా చెడిపోలేదు; ఇది కేవలం పఠనీయమే కాకుండా ప్రదర్శన యోగ్యం కూడా అయింది. Paradox కోసం అక్కడక్కడ Bernard Shaw వాక్యాలూ, భావాలూ, ఘట్టాలూ, పద్ధతులూ తీసుకోబడ్డా, తెనుగు పరిస్థితులకి అనుకూలంగానే నాటికంతా సాగింది.

ఆంధ్ర వాఙ్మయానికి ఇలాటి వేడి వేడి సాంఘిక నాటకాలు అవసరం అనిపిస్తున్నది.

కి. రా.

## యౌవన జ్వాల

(పద్యకావ్య సంపుటి : వెల 0-12-0)

కందుర్తి నరసింహారావు, 'సన్ డే టైమ్సు,' మదరాసు

నరసింహారావు గారి పద్యాలు ఆంధ్రలోకంలో రసజ్ఞులకు అంత అపరిచితము కావు. ఈయన నవకవులలో చెప్పుకో దగ్గ వాడు.

'యౌవన జ్వాల'లో, ఈయన 'మనఃపరిణామము' యువకలోకంలో అనేక సంస్కారములను రగులు కొల్పిన స్వేచ్ఛాగీతికి ప్రతిరూపమై, అడుగడుగునా చిత్రితమై, మూగసంగీతం పాడుతున్నది. తత్వదృష్టీ, లక్ష్య పరిశీలనమూ కనబడీ కనబడనట్లు పద్యాలలో సూత్రప్రాయముగా ఉన్నవి.

"ఇంతలో నింత చేరువ కేగుదెంచి
ఏలపోయెద వింతలో నెటకొ యెటకొ ?
మున్నొసంగిన సంకల్పములు హరించి
ఎన్న నెనుకోని గతులు కల్పింతువేల ?
నా తరము గాదు నీ ఖేల నమ్మికేల
ఎన్ని నాళ్లు వేధింతువో ఎరుగనైన
దానికే ఇంతయత్నింతు నేను – జగము
ఈమహా యత్నమందే నశించునేమి !"

'కర్తవ్యము'లో—

'ఏల పోనిత్తు విది వృథా, యీ విశుద్ధ
హృదయ గంగోదకమ్ముల, హితుడ, ఇట్టు
లేసఖీ రూప... పయోరాశి యందో
ఇంకి పోయి నశించిన నేమివచ్చు
అనకట్ట బిగించి తోయములు త్రిప్పి
ఎన్ని యెండిన బీళ్లు పండింపవచ్చు
ఎన్ని రతనాల సస్యమ్ము లేర్పరించి
నేలనాలుగు చెరగులు నింపవచ్చు"

'అద్భుతములో' లో—

కష్ట జీవిలోగల ఓర్పును బాగుగా చిత్రించాడు.

"తెల్ల నిప్పుల యెండలా ! ఇది
పల్లె కొంపల బ్రతుక నేర్పిన
కల్ల కపటములేని జీవికి
మల్లె పువ్వుల దండలా.

నీ బ్రతుకు పనిపాట లందే
నా బ్రతుకు మనపాట లందే
నిమిషమైనా నిదుర దవులక
నెత్తురోడ్చుట నేర్పరా......"

ఈయనలో సామ్యవాదదృష్టి, ప్రచారక లక్షణా లలవరుచుకోక పోవడమువల్ల అందంగా ఉన్నది. గొప్పకవుల లక్షణాలలో కొన్ని vision and drive కొంతవరకు ఈ కవిలో ఉన్నవి.

'జీవనశిల', 'పంప', 'నీలాంబరి', 'ప్రకృతి యుద్ధము', మొదలగు వాటిలో గల నిర్మల దృష్టి చదువరుల మనస్సులలో నూటిగా అచ్చుపడుతుంది.

'కవీంద్ర'లో A poet is a torch bearer of culture and light అన్న అభిప్రాయాన్ని స్ఫుట పరిచాడు.

"నలు దెసలు మ్రింగికొనివచ్చె విలయకాల
జలదకాండము బ్రహ్మరాక్షసి విధాన
మానవ గృహమ్ము చీకటి కోణమయ్యె
నీ కరజ్యోతి వెలిగింపరా, కవీంద్ర !

పచ్చి నేరేడు వంటి ప్రపంచ మపుడె
భాను డస్తంగతుడుగాగ పండిపోయి
నిలపై నేల రాలి కన్పింప దేమొ
నీ కరజ్యోతి వెలిగింప రా, కవీంద్ర !"

దేశభక్తి ప్రధానముగాగల కవిత్వము అందరిలో వలెనే ఇతనిలో గూడా కొత్తది కాదు. 'జవాహరిలాల్', 'పంప' ఉదాహరణాలు. అయితే నిరాశకు స్థానములేని ఆత్మ విశ్వాసము పూర్తిగా ఉన్నది.

కాని, ఈ నడుమ 'భారతీ' పత్రికా రాజములో ప్రకటించిన 'మంచుపాట'లో మాత్రము కవి నిరాశ కనబడు తున్నది.

తెలిసీ తెలియని కొంతమంది విమర్శలవల్ల ఈ కవి సుకుమారహృదయము గాయపడ్డట్టు తోస్తుంది.

'వ్రాసిన పద్యముల్ చెరిపివైచితి......'

రాగి

అనీ, "నేనిక నెన్నడున్ పంక నీకమనీయ హిమావనీ ధర ప్రాణసఖుండు పాదుమని రాజ్ఞ సమీరుని చేత పంపినం గాని' అనీ, కవి అన్న పల్కులు గాఢ విషాదాన్ని సూచిస్తున్నవి.

Edinburgh Review, Quarterly, Blackwood's పత్రికలు విమర్శలవల్ల Keats, Tennyson ప్రభృతులను కొంత నిరుత్సాహపరులను చేసినవి. నేడు ఆంధ్రదేశంలో ఉదీయమాన కవుల ఉత్సాహాన్ని కుంఠీభూతం చేసే కువిమర్శలు చెలరేగుతూ ఉంటున్నవి.

ఈ కమనీయ... ప్రాణసఖుండు... ఆజ్ఞ ప్రోత్సాహమూ ఇచ్చినట్లు ఎంచుకొని ఈ కవి ముక్త కంఠంతో ముద్దులు గులికే కావ్యాలు తప్పకుండా చెప్పగలనిం దని నా అభీష్టము.

—కృష్ణ—

Δ

## త్రిలోచన కవిరాజు

(కథాసంపుటి : 142 పుటలు. వెల 0-6-0)

రచయిత : రవీంద్రనాథమైత్ర. అనువాదకుడు : చక్రపాణి

ప్రకాశకులు : యువకార్యాలయం, తెనాలి

అనువాదాలు చదవలేను! కాని ఈ పుస్తకం ప్రారంభించింది మొదలు చివరవరకూ విడవకుండా ఒకే సారి చదివేలా నంటే హృదయరంజకంగా వుండటమే కారణమై ఉంటుంది.

హిందీ, బెంగాలీ, ఇంగ్లీషు అనువాదాలే పత్రికల్లో ఎక్కడ చూచినా ఇప్పుడు. వాటితో అనువాదా లంటే విసుగెత్తింది. ఇదివరకు ఎవ్వరో రెండుభాషలూ చక్కగా చదువుకొన్నవారు అనువాదం చెయ్యడంవల్ల చదవడానికి బుద్ధి పుట్టేది. ఇప్పుడో, చాలామంది అనువాదకులకు ఇటు తెలుగూ బాగా రాదు - అటు ఆభాషా చక్కగా రాదు!

మన తెలుగువారు సొంతబుద్ధిని ఉపయోగించడమే మానేసి యంత్రాలలాగా తయారయ్యారు. ఏ హిందీ, బెంగాలీ డ్రైవర్లో నడిపిస్తే నడుస్తవి; లేకపోతే లేదు! అనువాద అనుకరణములవల్ల క్రమంగా భావనాశక్తి హీనమై, ప్రజ్ఞాదౌర్బల్యం ప్రబల మౌతుంది.

ఈ పుస్తకం చూస్తే నాకు సంతోషమూ, విచారమూ కలుగుతున్నాయి. అనువాదంకూడా ఇంత సరసంగా చేసినందుకు సంతోషమూ, ఈ మాదిరిగా రాయగలిగినవారు కూడా స్వకపోలకల్పితగాథలు ఎందుకు రాయరా అని విచారమూ.

"కాకి అరిస్తే కోయిల కూసిం దని భ్రమపడేప్రాయాన" మొదలయిన చక్కనిభాషీకములు పుస్తకంలో చాలాచోట్ల కనిపిస్తున్నవి. కొద్ది లోపాలు లేకపోలేదు. కొన్ని కొన్ని చోట్ల మక్కీకి మక్కీగా అనుసరించి, తెలుగులోకూడా పరభాషా వాక్యరచనా పద్ధతినే ప్రవేశ పెట్టారు. అది మన భాషానుగుణము కాదు. అన్నికథలలోనూ చమత్కారం ఉన్నది. కొన్ని పన్నివేశాలు నర్మగర్భములు. అది కథకుడు అందె వేసిన చెయ్యి. ఇకముందు సొంతకథలు రసవంతంగా రాస్తే చక్రపాణిగారు మంచికథకుల్లో చేరుతారు.

రంగయ్య

Δ

## ఆంధ్రా వీక్ కమ్మెమొరేషన్ వాల్యూమ్

$\frac{1}{8}$ డెమీసైజులో 8 + 4 + 40 + 28 + 12 పుటలు. 22 చిత్రాలు.

వెల: రూపాయి. విద్యార్థులకు 8 అణాలు. దొరికేచోటు : ఏ.జి. ప్రెస్, బెజవాడ

ఆంధ్రాయూనివర్సిటీ తెలుగు లిటరరీ యూనియన్ వారూ, హిస్టరీ ఎకనమిక్స్ అండ్ పొలిటిక్స్ అసోసియేషన్ వారూ కలిసి వాల్తేరులో డిసెంబరు 1937 లో ఆంధ్ర వారోత్సవములు జయప్రదంగా జరిపారు; ఆంధ్రదేశంలోని ప్రముఖులచేత ఉపన్యాసా లిప్పించి, వాటిని ఈ గ్రంథ రూపంగా ప్రచురించారు.

ఆంధ్ర వారోత్సవాలకి ప్రారంభకులు శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగారు. పింగళి లక్ష్మీకాంతం గారు ఆంధ్ర సరస్వతిని గురించీ, అడివి బాపిరాజుగారు ఆంధ్ర శిల్పాన్ని గురించీ, గొర్తి వెంకట్రావు గారు ఆంధ్ర చరిత్ర సంస్కారాల్ని గురించీ, గాడిచెర్ల హరి సర్వోత్తమరావుగారు ఆంధ్రరాష్ట్రావశ్యకతను గురించీ, ఎం. వెంకటరంగయ్యగారు కొన్నిరాజకీయ రాజ్యతంత్రములను గురించీ ఉపన్యసించారు. ఉపన్యాసకు లందరూ ఆయా విషయాలలో సమగ్రంగా ప్రవీణు లవడంచేత ప్రతి ఉపన్యాసం అమూల్యమైంది; ప్రతి ఆంధ్రుడు పఠించ వలసింది.

ప్రత్యేకాంధ్ర రాష్ట్రావశ్యకతా, తద్విధానం, అందులోని మంచి చెడ్డలు, అసలు ఆంధ్రుల, వారి గొప్పతనం, ఆంధ్ర రాజకీయ, ఆర్థిక, వాఙ్మయ స్థితిగతులు, ఆంధ్ర శిల్పకళా ప్రాభవం—వీటిని తెలుసుకోవాలంటే ఈ గ్రంథం చాలా తోడు పడుతుంది.

ఇలాటి ఉపన్యాసాలూ, ఉత్సవాలూ ఆంధ్రులలో దాగి ఉన్నశక్తిని ప్రజ్వలింపజేసి, సత్వరాంధ్ర రాష్ట్రసిద్ధికి పాటు పడేటట్టు చేస్తాయి. అందుచే ఊరికే వాటితో మాత్రమే తృప్తిపడి ఊరుకోక ఆంధ్రు లేకీభూతులై కార్యశూరు లౌతారని ఆశిస్తున్నాము.

ఆంధ్రవారోత్సవాలు జయప్రదంగా నిర్వహించిన యువకులూ, అందుకు కారణమైన మనీషులూ అభినందనీయులు.

చే. సూ.

△

## ప్రేమ ధర్మము

కర్త: యల్లాపంతుల జగన్నాథం, బి. ఏ., చిత్తూరు

క్రౌను $\frac{1}{8}$ సైజులో 6+207+పుటలు. వెల: తెలియదు

ప్రపంచమతాల్లో ముఖ్యమైనవిగా ఎంచుకోబడుతున్న హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ మతాలు మూడింటికీ సామరస్యం నిరూపించడమే ఈ గ్రంథముయొక్క ముఖ్యోద్దేశం. అవసరమైనచోట్ల ఆయా మతగ్రంథాల్లోని ప్రమాణాల్ని చూపించి చర్చిస్తూ గ్రంథకర్త గ్రంథాన్ని తయారుచేశారు. ఈగ్రంథంలో చేయబడిందంతా అద్వైతప్రబోధం అని చెప్పొచ్చు. ఈ అద్వైతం ఏమతంలో ఏవిధంగా కనిపిస్తున్నదో, ఏరీతిగా మోక్షానికి నడిపిస్తున్నదో ఇందులో వివరింపబడింది. మతానికేపేరున్నా, ఏమతం ఏపేరుతో పిలిచి పూజించినా, భగవంతుడు ఒక్కడే అనీ, మనమతం గ్రహించి ఇతరమతాల్ని తెలుసుకోవడంవల్ల మనలో మతసహనం అనే మంచిగుణంఏర్పడుతుందనీ, ఈమతసహనం ప్రేమమీదనే ఆధారపడిందనీ, ఈ ప్రేమయే సర్వప్రపంచానికీ ఆధారభూతమనీ ఈ గ్రంథం స్పష్టపరుస్తుంది.

గ్రంథకర్త చెప్పినట్లు ఈ గ్రంథం ముఖ్యంగా విద్యార్థులకే ఉద్దేశింపబడింది. విద్యార్థులకు సులభగ్రాహ్యం అయేందుకు చేయబడిన కృషి ప్రశంసనీయం.

అసలు దేముడంటే - సాకారుడో, నిరాకారుడో- అతన్ని తెలుసుకొని, ప్రేమించి, స్మరించడమెట్లాగో సప్రమాణంగా చెపుతూ, అంతకంతకు పాఠకుని పై మెట్టుకి తీసుకుపోవడంలో జగన్నాథంగారిది అందివేసిన చెయ్యి అనవచ్చు.

కాని సర్వ వ్యాపియైన భగవంతుణ్ణి ఒక 'సింబల్'లో యిమిడ్చి ఆరాధించమనడం ఎంతవరకూ ఉచితమో ! విగ్రహారాధన అని వచ్చినపుడల్లా ముందు శిరొంచు కుంచినట్లు? చే. సూ.

Δ

## అపోహ

( సాంఘిక వచన నాటకం. వెల 0-6-0 )

కర్త : గాలి బాలసుందర రావు. ఉషాగ్రంథావళి. తెలప్రోలు

ఈ సాంఘిక నాటకంలో మానవప్రకృతి చక్కగా నిరూపింపబడ్డది. విశ్వాస రావు నిర్మలను ప్రేమించి పెళ్ళి చేసుకుంటాడు; అతని తమ్ముడు మోహన రావూ, నిర్మలా, ఎలాటి కృత్రిమ భావాలూ లేకుండా, స్నేహితుల్లా చాలా కలిసి మెలిసి తిరుగుతూంటారు; విశ్వాసరావు ఎంతటి ఉదారుడైనా, ఇతరులు చెప్పే మాటలు విని, అన్యాయంగా తమ్ముణ్ణీ, పెళ్ళాన్నీ, అనుమానిస్తాడు. మనోహరరావు ఉత్తమాదర్శాలు దృష్టిలో ఉంచుకొన్న వ్యక్తి; తనమూలాన అన్నా వదినెల కాపరంలో అశాంతి కలిగిందని ఆత్మ హత్య చేసుకుంటాడు. నేటి సంఘంలో అపోహ ఎలా పుడుతుందో, పెరుగుతుందో, చివరికి ఎలా పరిణమిస్తుందో బాలసుందరరావుగారు బాగా నిరూపించారు. సెక్సుమీదా, సొసైటీమీదా ఇందులో కొన్ని చిత్రమైన విషయాలు కనబడతవి.

ఇలాటి నవ్య గ్రంథాలను తక్కువ వెలకు ఆంధ్రలోకానికి అందిస్తున్న ఉషాగ్రంథావళి సంపాదకులు శ్రీ మాధవ శర్మకు అభినందనాలు ! శి. రా.

Δ

## విజ్ఞానం

( శాస్త్ర విషయక పత్రిక. చందా రూ 4 )

సంపాదకుడు : కాశీ పట్నపు కొండయ్య, (M. Sc.) రాజమహేంద్రవరము

Science కు సంబంధించిన విషయాలు రెండు మాసాలకు ఒకసారి ప్రకటించే గొప్ప పత్రిక. ఇటువంటిది ఇదివరలో మన భాషలో లేదు. సామాన్యంగా ఆంధ్రుల చదువు literary; దేశంలో science education చాలా తక్కువ. సయన్సు బాగా తెలిస్తే దుర్ విశ్వాసాలూ, భ్రమలూ, అజ్ఞానాలూ తొలిగిపోయి జ్ఞానోదయ మవుతుంది !

ఈ పత్రికారాజములో సయన్సులో నిష్ణాతలు అయిన మన ఆంధ్ర పట్టభద్రులు చాలా మంది జ్ఞానప్రదమైన వ్యాసాలు వ్రాస్తున్నారు. పారిభాష పదాలను నిసలు చెయ్యడానికి సంపాదకులు చక్కని ప్రయత్నం చేశారు.

పత్రికకు ప్రథమ సంవత్సరం దాటింది. 'విజ్ఞానం' చిరాయువుగా జ్ఞాన వ్యాప్తి చేస్తుందని మా విశ్వాసం. కొండయ్యాగారిని చాలా అభినందిస్తున్నాము ! పత్రిక ప్రతి పాఠశాలలో, ప్రతి పుస్తక భాండారంలో, ప్రతి ఆంధ్ర గృహంలో ఉండవలసింది !

## ముత్యాలశాల

( తొమ్మిది కథలు : డెమ్మీ 160 పుటలు : వెల రూపాయి )

వెంపటి నాగభూషణం, పద్మావళీ పరిషత్, మచిలీపట్టణము

ఇందులో తొమ్మిది కథలూ తొమ్మిది ముత్యాలు. ప్రారంభిస్తే ఏకథా చివరంటా చదివేదాకా వదిలిపెట్ట లేము; ప్రతీకథలోనూ ఏదో ఒక ఉన్నతా దర్శమో, ఉత్తమాశయమో కనిపిస్తుంది. అసలు కథ రాయడం అంటే ఏమిటో తెలిసిన కొద్దిమంది ఆంధ్రకథకుల్లో ఈ గ్రంథకర్త ఒకరు.

వెంపటి నాగభూషణంగారు ఆంగ్లంలో బాగా కవిత్వం చెప్పగలవారు; కాని తెలుగులోనూ, సంస్కృతంలోనూ వీరికి గొప్ప సంస్కారం ఉన్నట్టు ఈ కథలవల్ల బోధపడుతుంది; ఇందులో భాషా, సాంప్రదాయాలూ చూస్తే గ్రంథకర్త త్రిభాషాప్రవీణు లని స్పష్ట మౌతుంది.

"తలవని తలంపులు" లాంటి కథలు ఉత్తమాదర్శాన్ని బోధిస్తాయి; "చిలుక పలుకులు" మొదలైనవి గుండెకు పట్టి కలత పుట్టిస్తాయి: "మూడు రాత్రులు" ఇత్యాదయః వలాసాగా చదువుకో వచ్చు. ప్రతికథలోనూ, ఒక కొత్త Technique, ఒక కొత్త thought కనిపిస్తాయి.

ఒక విషయం తోస్తుంది; మల్లాది రామకృష్ణశాస్త్రిగారి మజాలు చూచాయగా ఈ కథాసంపుటిలో కనబడుతున్నాయి, ఇద్దరూ అంతరంగిక మిత్రులు కావడం చేతనో, మల్లాదివారిమీద మక్కువ చేతనో, శాస్త్రిగారిచేత వ్యాసప్రోక్తం కావడం చేతనో తెలియదు.

ఈ కథల్లో Originality బాగా కనబడుతుంది. భూషణంగారి కథలు ఆంధ్ర సరస్వతికి భూషణప్రాయాలు. వీరికథ ప్రకటించని పత్రిక లేదు. ప్రకటన కావలసిన కథాసముచ్చయం చాలా ఉన్నట్టు వింటాం. అది కూడా బయటకు వస్తే బాగు!

శి. రా.

## మహతి

[ మాసపత్రిక : చందా రు. 2. ]

సంపాదకుడు : వానిరెడ్డి వేంకట సుబ్బయ్య, తెనాలి

మనభాషలో మాసపత్రికలు చెప్పుకో తగ్గవి చాలా తక్కువ: భారతి, గృహలక్ష్మి, ఆంధ్రభూమి వీణ. మహతి పత్రిక ఈ నడుమ బయలు దేరింది; 4 సంచికలు వచ్చాయి. రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, విశ్వనాథ వెంకటేశ్వర్లు, మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి, కవిరాజు, బోడేపూడి వెంకటారావు, సామవేదం జానకిరామశర్మ, వేలూరి శివరామశాస్త్రి, వానిరెడ్డి వెంకట సుబ్బయ్య, తుమ్మల సీతారామమూర్తి చౌదరి, సుబ్బారాయ చౌదరి, హనుమచ్ఛాస్త్రి, కౌకుళయ్య మొదలైన కవుల పద్యాలు పత్రిక నలంకరిస్తున్నవి. జమ్మల మడక మాధవరామశర్మ, వడ్లమూడి వెంకటరత్నం, గోపీచంద్, జి. వి. కృపారావు, పి. వి. సుబ్బారావు, మరుపూడి వెంకటేశ్వరరావు, కొడవటిగంటి కుటుంబరావు, శరణు రామస్వామి చౌదరి మొదలైన రచయితల వ్యాసములూ కథలూ చాలా వరకు కనబడుతున్నవి. వ్యాసములు ఉన్నతశ్రేణిలో ఉన్నవి. కథలలో కొంత satire గోచరించుతున్నది. మొత్తంమీద పత్రికది కొంతవరకు పాతదృష్టి.

విద్వత్కవి ఐన ఈ పత్రికా సంపాదకులు వ్యాసరచనకు ఎక్కువ ప్రోత్సాహం ఇస్తే సాహిత్యం వృద్ధి పొందుతుంది.

శి. రా.

[ సమీక్షార్థం పంపే పుస్తకాలు మాకు రెండేసి ప్రతులు చేరాలి—సంపాదకులు ]

# సమాలోచన

## ఆకాశవాణి (Radio)

మదరాసులో దొరతనమువారు ఇటీవల Radio Station నెలకొల్పి తెలుగులో ప్రసంగాలూ, నాటక పఠనలూ ఏర్పాటు చేయడంవల్ల దేశానికీ, సారస్వతానికీ చాలా మేలు కలుగుతున్నది. ఆయా విషయాల్లో ప్రవీణులైనవారికి ఆహ్వానాలు పంపించి అన్ని సదుపాయాలూ చేస్తున్న ఆచంట జానకిరాం గారిని అభినందించవలె. ముఖ్యంగా సంతోషించవలసింది వాడుక భాషలోనే అన్ని ప్రసంగాలూ జరుగుతున్నందుకు.

శ్రీయుతులు గిడుగు రామమూర్తి పంతులు, వేటూరి ప్రభాకర శాస్త్రి, దేవులపల్లి కృష్ణ శాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, మొక్కపాటి నరసింహ శాస్త్రి, అయ్యంకి వేంకట రమణయ్య, కోలవెన్ను రామకోటీశ్వర రావు, అడివి బాపిరాజు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, బెజవాడ గోపాలరెడ్డి, నీలంరాజు శేషయ్య, తెలికిచర్ల వెంకటరత్నం, తాపీ ధర్మారావు, గూడవల్లి రామబ్రహ్మం, ఉన్నవ లక్ష్మీనారాయణ—ఇత్యాది ప్రముఖులు వివిధ విషయాలను గురించి పావుగంట చొప్పున చేసిన ప్రసంగాలవల్ల శ్రోతలకు వివిధ విషయాలు విశద మవుతున్నవి.

అనార్కలీ, చింతా దీక్షితులుగారి శబరి, కచదేవయాని, నోరి నరసింహ శాస్త్రిగారి సోమనాథ విజయం, అపోహ మొదలైన నాటికలు నలభైయైదు నిముషాలపాటు వినిపించడంవల్ల నాటకకళ వృద్ధిపొందడానికి అవకాశం ఉన్నది.

ఆకాశవాణివల్ల ఆంధ్రసారస్వత ప్రచారంచేసే All India Radio Station,Madras వారిని అభినందిస్తున్నాము.

## సన్మానాలు

మన కవులను, గాయకులను, విద్వాంసులను, నటులను గౌరవించడం చాలా సమంజసం. కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారిని నెల్లూరు పౌరులు; స్థానం నరసింహారావు, పరబ్రహ్మ శాస్త్రి గార్లను బందరు Cultural Academy వారూ, సన్మానించారు.

ఇటువంటి సన్మానాలవల్ల ఆంధ్రాభ్యుదయం సమకూరడానికి సంశయంలేదు. నెల్లూరు, బందరు పౌరులు ప్రశంసాపాత్రులు.

**Edited, Printed & Published by T. Venkataratnam, M. A., L. T.**
**Printed at the Andhra Grandhalaya Press, Bezwada.**
**Published at The Navya Sahitya Parishat, Guntur.**